



# తారకమంత్రం



శ్రీ క వు లూ రి



ప్రజాప్రచురణలు



# తారకమంత్రం

(కథలు)

శ్రీ కవులూరి

ప్రచురణ

ప్రజా ప్రచురణలు

ఏలూరు.

# తొలిపలుకు



పాఠకులకు నమస్కృతులు. ఎప్పటివలెనే మీ ఆదరణ లభిస్తుందని ఆశ.

నా కథలను 'విశాలాంధ్ర', 'కళాంజలి', 'జనవాణి', 'తెలుగు విద్యార్థి' పత్రికలలో ప్రచురించి, నారచనలకు ప్రోత్సాహ మిచ్చిన ఆ పత్రికా సంపాదకవర్గములకు సదా నా కృతజ్ఞత.

నా కథల్లో కొన్నింటిని గ్రంథరూపంలో పాఠకుల కందించడానికి సాహసంతో ముందుకు వచ్చిన 'ప్రజా ప్రచురణల' నిర్వాహకులకు నా కృతజ్ఞతాభినందనలు.

విజయవాడ,
27—10—59.

కవులూరి.

# విషయసూచిక



# అర్థంకాని కల

చీకటిపడుతోంది, బజార్లన్నీ జనసమ్మర్దంతో నిండి ఉన్నాయి. సినిమా దాటిపోతూందని కాబోలు, సినిమాకు పోయేజనం ఆతురతగా నడుస్తున్నారు. సైకిళ్ళక్యారియర్సుకు ఆఫీసుఫైళ్ళతో, ఆఫీసు కష్ట సుఖాలు చెప్పుకుంటూ, స్వేచ్ఛావాయువును పీలుస్తూ. నవ్యశక్తిని పొందుతూ నెమ్మదిగా నడుస్తున్నారు. కొట్లవద్ద, సరుకులు కొనేవారు షాపు యజమానులను తొందర పెడ్తున్నారు ఇండ్లకు పోవాలనే ఆతురతతో. మొత్తంమీద పట్టణము యథా విధిగానేసాగిపోతున్నట్లుంది. సుఖదుఃఖముల నన్నింటిని తన గర్భములో దాచుకుని, విద్యుద్దీపాలతో పట్టణము మెరసిపోతూనే ఉంది. ఆశలు నెరవేరినవారికి, క్రొత్తఆశలను కలిగిస్తోంది. ఆశలు నెరవేరనివారికి పట్టణ శోభ, విద్యుద్దీపముల కాంతి, వెలుగును ప్రసరింపజేయడంలేదు. ఆశ అనేది లేక పోతే మానవుడు జీవించనేలేడు. ఆ ఆశతోనే దీనంగా శూన్యంగా చూస్తూ ఓ వ్యక్తి నిరీక్షిస్తున్నాడు.

ఆ వ్యక్తి ఎందుకు, ఎవరికొరకు నిరీక్షిస్తున్నాడో తెలియదు. యువకుని గుడ్డలు మాసివున్నాయి. గడ్డం మాసివుంది. కండ్లు లోతుకు పోయి సంస్కార మెరుగని పెద్ద జుట్టుతో చూడడానికే రోతగా కన్పిస్తు న్నాడు. శూన్యంగా, నాలుగు వైపులూ కలియజూశాడు. ఇంతలో అతని మిత్రుడు కాబోలు, "ఏరా! అప్పలస్వామి ఇక్కడున్నావే: చా తాగు దాం రా" అనిలాక్కు పోయాడు. మిత్రునివెంట, బరువైన హృదయంతో, స్పర్శజ్ఞానాన్ని కోల్పోయిన తన శరీరాన్ని అప్పలస్వామి మోసుకు పోయాడు. చా త్రాగి, తిరిగి మళ్ళీ అదే స్థలానికి వచ్చి, బజారువంక దీనంగా చూస్తున్నాడు. బహుశా టీ త్రాగడంతోనూ, మిత్రుడిచ్చిన బీడీ దమ్ముతోనూ బుర్ర పనిచేయడం ప్రారంభించింది కాబోలు!

బీడీ పొగవదల్తూ, ఒక షాపువైపు నడిచాడు అప్పలస్వామి. అతనికాళ్ళు షాపు మెట్టు ఎక్కగానే, వణకడం ఆరంభించాయి. చూపులు ఖంగారును సూచిస్తున్నాయి. ముఖకవళికలు మారి పోయినయ్. మనిషి బెదురుగా చూస్తున్నాడు. గుండెలు విపరీతమైన వేగంతో కొట్టుకోవడం ప్రారంభించినయ్.

ఉక్కిరి బిక్కిరయ్యాడు. "ఎవరో వచ్చి పట్టుకున్నట్లు భావించి, వెనుకకు బెదురుగా చూశాడు. జనం మామూలుగా ఎవరిదారినివారు పోతూనే ఉన్నారు. అదంతా తన ఊహే. ఎక్కిన మెట్లుదిగి గభాగభా నడచి పోతున్నాడు. ఎవరో తనను తరుము తున్నట్లు భావించాడు. వెనుదిరిగి చూస్తూ, ఖంగారుగా నడవడంలో, ముందున్న మనిషిని ఢీకొన్నాడు. వాడు నాలుగు తిట్టి వాడిదారినివాడు పోయాడు. అంతకు మించి తనకు ఏమీ చేయనందుకు అప్పలస్వామి వాణ్ణి అభినందించి, ముచ్చెమటలతో ఓసందు దారిని పట్టాడు.

తిరిగి అతని బుర్ర అతివేగంతో పనిచేయడం ప్రారంభించింది. ముచ్చెమటలు పోసి ఉన్నముఖాన్ని ఒకసారి ఆ మాసిన చొక్కాతో తుడుచుకొని భారంగా ఒక నిట్టూర్పు విడిచి, ఒక తూముమీద చతికిల పడ్డాడు. షాపువద్ద తనకు కల్గిన నీచమైన దుర్బుద్ధికి తనను తాను తిట్టు కొని, ఆ పని చేయనందుకు మళ్ళీ తనకు తాను అభినందించుకున్నాడు. "దొంగతనము" పేరుతలచుకునేటప్పటికి మనిషి తపించిపోయాడు. దొంగతనానికి కూడ ధైర్యం, తెలివితేటలూఉండాలి! నీతి నియమాలతో పనిలేకుండా ఉండాలి! వీటిలో అప్పలస్వామికి ఒక్కటికూడా లేదు. అలాంటప్పుడు అప్పలస్వామి నిజాయితీకి. నీతికి చోటులేని ప్రపంచంలో ఎలా బ్రతుకుతాడు?

అదే అతని సమస్య. ఇల్లు గుర్తుకు వచ్చింది. ఇంటిలో కాలు పెట్టడమంటే యమలోకంలో కాలు పెట్టినట్లుగా భావించుతున్నాడు. ఇంటికి వెళ్ళకపోతే, పెళ్లాం బిడ్డల సంగతి ఏంకాను! వెళ్ళితే పెళ్లాం,

బిడ్డల గోడు వినలేదు. బాధ చూడలేదు. అతనికి పిచ్చెత్తినట్లయింది. మళ్ళీ తూము మీద కూర్చున్నాడు.

ఇంతలో మరో ఆలోచన అతనికి తట్టింది. తనకీ దురవస్థకు మూలం తన పెళ్ళాం అనుకున్నాడు. ఇప్పుడు పెళ్ళాం బెల్లాం కాక, రాక్షసిలా కన్పించింది అప్పలస్వామికి, అవును! అతని కష్టాలన్నిటికీ ఆమెయేగదా! పెళ్ళి చేసుకొనకపోతే పెళ్ళామేలేదు: పెళ్ళాం లేక పోతే పిల్లలులేరు! మళ్ళీ యింకో ఆలోచన అతని మనస్సు మార్చింది. పెళ్ళాన్ని యింతగా తిట్టినందుకు బాధపడి, యీ మహాపరాధమంతా తనది అని అనుకున్నాడు. తననితాను లోలోపల కసిదీరా తిట్టుకున్నాడు.

నిజమే! తన్నుతాను పోషించుకో లేనివాడికి పెళ్ళాం ఎందుకు? పోనీ పొరబాటున పెళ్ళి చేసుకుంటే 2 సంవత్సరాలలో ఇద్దరు పిల్లలా? ఇది మరీ ఘోరమనుకున్నాడు. ఇంత విశాలప్రపంచంలో తన ఒక్కని మీదనే కోపం ఎందుకుండాలి? కాబట్టి ఇందులో దేవుని తప్పులేదు. కాబట్టి తన తప్పే ననుకున్నాడు. పెళ్ళిచేసుకునేనాడు ఉండక్కర్లా ఈ బుద్ధి: పెళ్ళి చేసుకుంటే పిల్లలు పుట్టరూ మరి! "ఈ జ్ఞానం పెళ్ళి చేసుకొనేనాడు లేకపోయింది. పెళ్ళి రోజున ఆనందానికి అంతుందా? స్నేహితులకు, బంధువులకు, సిగ్గుగా, సంతోషంగా గొప్పగా పెళ్ళి విషయం చెప్పి ఆహ్వానించానే: కొడుకు పుడితే వాడి నేదో పెద్దగా చదివించి, ఓ పెద్ద ఆఫీసరుగా తయారు చేయాలనుకున్నానే!" అని తన్ను తాను మరల తిట్టుకున్నాడు. ఎందుకీ బ్రతుకు? పౌరుషం లేని బ్రతుకు? ఎందులోనైనా పడి ఛస్తే మంచిదనుకున్నాడు. మనస్సు గట్టిపరచుకున్నాడు. పిచ్చెత్తిన వానిలా బయలుదేరాడు ఎక్కడికో?

రెండు నెలలుబట్టి నౌకరీ దొరకకనే గదా ఇన్ని అవస్థలూ పడింది! ఈ అవస్థల మూలంగానేకదా ఈ పిచ్చిఊహలన్నీ కల్గినయి. ఏం చెయ్యాలో అప్పలస్వామికి తోచలా. మతి చెడింది. చెడినమతి దారిలోకి రావాలంటే, అప్పలస్వామికి ఒకటేదారి కన్పించింది. త్రాగుడు! కల్లు! ఏది! దానికీ నిషేధమేగా! నిషేధమైతేమాత్రం ఏం! డబ్బుండాలిగాని!

ఏ యింటిలో పడితే ఆయింటిలో దొరికేదే. మళ్ళీ అనుకున్నాడు త్రాగ డానికే డబ్బుంటే ఈ పిచ్చి ఆలోచనలన్నీ రానే రావని.

కష్టాలను మరిపించి, వళ్ళు తెలీకుండ నిద్రబుచ్చేది త్రాగుడే! ఏదీ! ఎవరు పోయించుతారు? ఏ స్నేహితుడైనా రోజూ ఎక్కడ పోయించగలడు ఈ కరువురోజుల్లో! అలవాటు లేక పోయినా, బాధలను మరచిపోయేందుకు బుద్ధి త్రాగుడుపైకి మరలించింది. ఆ కోరిక నెరవేర లేదు. ఎటు చూచినా అతనికి అంధకారమే. అతనికి భూమిమీద నిల్చు న్నట్టేలేదు, వెలుతురు ఎక్కడా కన్పించడంలా. పిల్లిలా చీకటిలో ఇంటివైపు దారితీశాడు .... .... మళ్ళీ ఆగాడు .... వెడదామా, వద్దా అనే ఆలోచన ....

"లేనివాడిపనే హాయి. ఏ బాదర బందీ ఉండదు. అంతగా లేక పోతే కడుపులో కాళ్ళుపెట్టుకుని పడుంటాడు" అంటారు ఉన్నదాన్ని ఖర్చుపెట్టలేని మహానీయులు. పేదవాడికి పస్తులు నిత్యం తప్పవు. లేని వాడు పట్టెడన్నం' హక్కుగా అడిగితేనే, ఈ సమాజం బెదిరిపోతుంది. అలాంటి మహాప్రపంచంలోఅల్పుడైన అప్పలస్వామికి ఏం కనిపిస్తుంది!

అప్పలస్వామి కొరికే అన్నట్లు, అప్పలస్వామి యజమాని దివాళాతీశాడు. దాంతో అప్పలస్వామికి మరో కార్ఖానాకంపెనీలో ఎక్కడా నౌకరీ దొరక్క పోవడం జరిగింది. నౌకరీ కొరకు తిరిగి తిరిగి కాళ్ళు కాయలు కాచినయి. అయినా ఉద్యోగం మాత్రం లభించలేదు,

ఇంటిని సమీపిస్తున్న అప్పలస్వామికి మరో ఆలోచన తట్టింది. "ముష్టి ఎత్తి అయినాసరేపెళ్ళాం బిడ్డలను పోషించాలిఅని. మళ్ళీ వెంటనే "అడుక్కోవడ మంత నీచమైనపని మరొహటిలేదు" అనుకున్నాడు. అతడే కారులదగ్గర ఎవరైనా అడుక్కుంటూంటె "పోయి ఏదైనా పని చేసుకోరాదా!" అనేవాడు.

ఇల్లు కనుచూపు మేరలో వుంది. నిగూఢంగా ఆత్మాభిమానం అతనిలో పొంగిపొరలింది. అడుక్కుని బ్రతికేబ్రతుకు బ్రతుకేకాదను కున్నాడు. ఇంతలో ఏవేవో కేకలు అస్పష్టంగా అతని చెవుల్లో విన

పడినయ్. వాడకట్టునవుండే మామూలు తగాదాలై వుంటాయనుకున్నాడు. కాని ఇంకో రెండడుగులు వేసేసరికి తన భార్య కేకలు, తన యింటి ప్రక్కావిడ కేకలు వినపడినయ్.

"అంత మొగసిరి దానివైతే నా అర్ధశేరు బియ్యం నాకిచ్చి వెయ్యవే" అన్న ప్రక్కావిడ మాటలు ముందు వినపడ్డాయి.

"మాలావు ఇచ్చావులెద్దూ ఎట్టయితే అప్పు అర్ధశేరు బియ్యం; తిట్టావంటే మర్యాద దక్కదు" అన్న భార్యమాటలు వినిపించినయ్. ఈ కేకలువినేటప్పటికి అతని గుండెబెదరిచెదిరిపోయింది. అక్కడనుండి పారిపోదాం అనుకున్నాడు. కాని అడుగు ముందుకేపడింది. గబగబా వెళ్ళి, పెళ్ళాన్ని నాలుగుతిట్టి, ఆవిడను పంపించి వేశాడు. అప్పటివరకు అతనిలో రేగిన ఆత్మాభిమానం ఒక్కసారిగా జాలిపోయింది.

"ఏం బాబు! ఈ కొంపలో కాపురం చేయటం నా చేతకాదు. నీకేం ఎక్కడికో పొద్దున్నే పోతావు, ఇప్పుడొస్తావు. ఈ అప్పులోళ్ళకు సమాధానం చెప్పలేక నా నోరు పడిపోతోంది" అంటూ అప్పలస్వామి భార్య ఏడవడం మొదలెట్టింది.

"ఎవరెన్నన్నా ఇప్పుడు మనం పడాల్సిందే. ఏంచేస్తాం? మన రోజులు"

"ఈ కాపురం చేస్తా, బతికేదానికంటే ఛస్తేనేమేలు" అంది అప్పలస్వామి భార్య.

"చావు! ఎందులోనైనాపడి చావు! పీడా వదల్తుంది" అన్నాడు చిరాకుగా.

ఇంతలో కుర్రాడు గొల్లున ఏడ్చాడు. చిరాకుమీదవున్న తల్లి ఆ కుర్రాణ్ణి చితకబాదింది. ఇదిభరించలేక పోయాడు అప్పలస్వామి. ఈ కుటుంబాని కీతిప్పలు రావడానికి తాను మూలమనుకుని, కండ్ల వెంబడి నీరు ధారగా కారుతున్నాయి. అప్పలస్వామి వచ్చాడని తెలియ గానే అప్పులవాళ్ళు చుట్టుముట్టి నోటికివచ్చినట్లు తలొకమాటా మాని, వెళ్ళిపోయారు. అవమానాన్ని భరించలేకపోయాడు. భార్య వెక్కివెక్కి

ఏడుస్తూ ఓమూల కూలబడింది. చంటిబిడ్డడు పాలకొరకుఏడుస్తున్నాడు. పెద్ద కుర్రవాడు ఏడ్చి, ఏడ్చి ఓపికలేక కాబోలు సొమ్మసిల్లి అమాయ కంగా నిద్రపోతున్నాడు. ఇంటిలో దీపంలేక కన్ను పొడుచుకున్నా యేమీ కనుపించడంలేదు.

"ఎందుకురా బ్రతికావు ముండ బ్రతుకు!" అన్న అప్పులవారి మాటలు అతని చెవుల్లో మార్మోగుతున్నాయ్. తీర్చే విధానం కన్పించ టంలేదు. ఔను వాళ్ళతప్పులేదు. ఎన్నాళ్ళు వాయిదా ? మరి మతి చెడి పోయింది. వంశం ప్రతిష్ఠ అంతా నాశం అయిపోయినట్లుగా భావిం చాడు ! ఎంత క్రూరంగాఉంది ప్రపంచం, అతనికిసానుభూతి ఒక్కడూ చూపలేదే ! ఏం చేస్తాడో అతనికే తెలీదు.

క్రింద సొమ్మసిల్లి, నిద్రపోతూన్న బిడ్డను వెదకి చేతుల్తో ఎత్తు కున్నాడు. "ప్రపంచంనుంచి తోసివేయబడిన తండ్రి కొడుకు ! పెండ్లాంచే రోసివేయబడిన తండ్రి కొడుకు ! పెరిగి పెద్దవాడయితే కొడుకుచే రోసివేయబడే తండ్రి కొడుకు ! అప్పులవాళ్లచే అవమానానికి గురికాబడిన తండ్రి కొడుకులు ! రేపు యీ కొడుకూ అవమానాన్ని పంచుకోవాలి ! వాడెందుకు పంచుకోవాలి ? బ్రతికివుంటే పంచు కుంటాడు. కాబట్టి బ్రతికి వుండకూడదు" అనుకునే పిచ్చిఆలోచనలతో బిడ్డ గొంతుకను పట్టుకున్నాడు. "ఏమిటి ?" అంటూ తల్లి లేచింది.

"ఏమీ లేదు,"

"ఎందుకండీ పిల్ల కెవ్వు మన్నదీ ?" పిల్ల బిక్క చచ్చిపోయి తల్లి వంక మిడిగుడ్లతో చూసింది. తల్లి పిల్లను గుండెకు హత్తుకొన్నది. బిత్తరిపోయి తండ్రివంక పిల్లచూస్తూ మళ్ళీ కెవ్వుమన్నది. తండ్రి ఆడదానిలా బావురుమన్నాడు.

"ఏమిటం డిదంతా ?"

భర్త మౌనంగా భార్యకేసి చూశాడు. అర్థంకాక భార్యభర్తను చూసింది. చంకనున్న పిల్ల మాత్రం యిదంతా నా కర్థమైనదన్నట్లు తల్లిని చూపుతో సలకరించింది.

# దాసుడు

భర్త చంద్రానికి సీత భోజనం వడ్డించింది. ఎందుకో అతడు రుస రుస లాడుతూ భోజనం ముందు కూర్చుని పళ్లెంవంక తీక్షణంగా చూచాడు, పళ్లెంచుట్టూ ఉన్నగిన్నెలపై మూతలుతీసి చూశాడు. ఆకలితో పళ్లెంముందు కూర్చున్న చంద్రానికి ఆకస్మికంగా అరికాలు మంట నెత్తికెక్కింది. ఆ కోపానికి ఆకలి భయపడి పారిపోయింది.

"వెధవకూరలు నువ్వూను! ఇవి తప్ప ఇంకేం దొరకలేదేం?" అంటూ ముందున్న పళ్లాన్ని ఒక తన్ను తన్ని లేచాడు. అవ్వనండి! లేకపోతే చంద్రంవంటి భర్తకు, పొట్లకాయ కూరను, చారును, గోంగూర పచ్చడీనా?

"ఏం చెయ్యమంటారు? ఉన్న కూరలవి." అంది సీత.

"లేకపోతే తెప్పించి వండాలి" అన్నాడు ఉరుముతూ.

"ఈ ఊళ్లో కొనేందుకు ఏం దొరుకుతయి? వచ్చేటప్పుడు మీరు పట్టుకు రాకూడదా?" అంతమాట అడుగుతుందా భర్తను సీత!

ఈ సమాధానం చంద్రాని కొరక చెంపపెట్టులా కన్పించింది. "పెళ్ళాం గాని, దేవతయినాగాని, ఆడదానికి అలుసివ్వకూడ" దని పెద్ద లంటారన్న మాట ఆ క్షణంలో అతనికి గుర్తుకు వచ్చింది. సీత చెప్పిందాంట్లో తప్పేమీ లేకపోయినా అతనికి, ఆమె అన్న ప్రతీమాట తన నెదిరించాలని చెప్పినట్లే తోచి, కోపంలో సీత జుట్టునైతే పుచ్చు కున్నాడుగాని. అతని కేదో మళ్లీ దయగలిగి ఈసారికి ఒక హెచ్చరికతో వదిలేసి వెళ్లిపోయాడు,

చంద్రంయువకుడే. సామాన్యంగాచదువుకున్నవాడు. అనుశృతంగా పురుషుని పెత్తనం స్త్రీపై సాగిపోతూన్నట్టే, ఈనాడూ సాగిపోతూ ఉన్నమన సమాజంలో, ఏదో అతనిలో ప్రత్యేక విజ్ఞానపుఛాయలుంచేనే తప్ప, లేకపోతే పాత వరవడిలో చంద్రం కొట్టుకుపోవడంలో ఆశ్చర్య

మేముంది ?........పురుషుని ఆధిక్యతా భావం అతనిలో గతంలో ఎక్కడో నిద్రాణమై ఉంటూండేది, ఈ మధ్య ఆతణ్ణి మేల్కొల్పి, అతణ్ణి సీత విషయంలో నిత్యం హెచ్చరిస్తూనే ఉంది. చంద్రం మనస్సు మాటను కాదని భార్యను లొంగిపోవడానికి అంత బలహీనుడనుకున్నారా ఏం? ....ఆ హెచ్చరికను గమనించి, ఆ భావాన్ని ఆచరణలో పెట్టకపోతే పురుషజాతికే తీరని కళంకం తెచ్చి పెడుతున్నానని, తీరని ద్రోహం చేస్తున్నానని భావించేవాడు చంద్రం ఏమనుకున్నారో! అందుకేగాబోలు "స్త్రీలకు స్వాతంత్ర్యంయిస్తే సంఘం నాశనం అయిపోతుంద"ని, పురుషజాతి ఆధిక్యతకై నడుములు బిగించిన వారంతా, చంద్రాన్ని సత్కరించి, అతణ్ణి పుష్పమాలాలంకృతుని చేసి, సన్మానసభలో అతనికి కృతజ్ఞతాంజలులను అర్పించాలని తీర్మానించారు. ఎంత అదృష్టవంతు డంటే చంద్రం!....అంతమాత్రాన మిగతా పురుషులకు పెద్ద ఈర్ష్యవచ్చి, ఆడవాళ్ళను వెనక వేసుకువచ్చి, చివరకు పంచమాంగదళంగా కొంత మంది తయారయ్యారాయె ఖర్మం! అది చంద్రం, అతని గురుపుంగవ వర్గానికి ఎంతో కోపాన్ని తెప్పించింది....అయినా ఎవరైనా ఏంచేయ గలరు? .... కాలం మారిపోతూనే ఉంది .... అయితే చంద్రం మారే కాలప్రవాహం వెంటకొట్టుకు పోతున్నాడనుకున్నారేమో? .... అంత మంచిపని - కాదు పొరపాటు పని - ఎన్నడూ చేయడని తెలుసుకోండి.

ఒకరోజున చంద్రం యింటికి వచ్చాడు.

"ఒసేయ్" అని పిలిచాడు — ఇదివరకు ఒకోసారి 'సీతా' అనో, లేక 'నిన్నే' అనో దయతలచి పిలిచేవాడు....దయతలుస్తూంటే, సీత మరీ నెత్తికెక్కిపోతోంది!

చూచారా మరి!....వెంటనే వచ్చిందా?....రాలేదు.

"ఒసేయ్....ఎక్కడ చచ్చావ్?" అని యింటిపెంకు లెగిరిపోయేట్టు అరిచాడు.

వంటింట్లో బిడ్డకు పాలిస్తూన్నసీత, "వస్తున్నా" అనే సమాధానం చెప్పిందేకాని రాలేదు. చూచారా! ఆడదానికింత పొగరా!....అందు

లోనూ, ఇంటికిగవర్నరయిన చంద్రంగారు పిలిస్తే ఆడ 'ఫ్యాను' అయిన సీత రాకపోవడం క్షమించరాందిగా కన్పించింది.

అతడు సీతను వెతక్కుంటూ వెళ్ళేప్పటికి, సీత పాలిస్తున్నట్లు చూచాడు.

"పాపకు పాలిస్తున్నానండీ" అంది గజ గజ వణకుతూ సీత. చూచారా ఎంత అదుపాజ్ఞల్లో పెట్టాడో మరి!

అయినా, తిరిగి సమాధానం చెప్పడం ఇంటి గవర్నరయిన చంద్రానికి తిరస్కారంగానే కన్పించింది. 'తప్పయిందండీ' అన్న ధోరణియే కన్పించదే సీత ధోరణిలో! అందులోనూ, సీతకు, ఇంత విశాల భారతదేశంలోనూ, మొగుడనేవాడు దొరక్కపోతే, చంద్రానికి అయిదువేలు, రెండెకరాలిచ్చి తన భర్తగా కొనుక్కుని మరీ తెచ్చుకుందే! ....పూర్వం కొనుక్కున్న బానిస, బానిసగానే నిర్వచించరాని బండచాకిరీ చేసేవాడు....అట్లా అంటే, చంద్రం అట్లానే అనుకునేరు కొంపతీసి!.... ఆ! అక్కడే మరి చంద్రం గొప్పతనమంతా!....చంద్రాన్ని కొనుక్కున్న సీత, చంద్రానికి బానిస తెలుసా!....చూచారా!.... మరిచంద్రం గొప్పతనం!

మరి అంతటివాడు పిలిస్తే తిరిగి సమాధానమా?....నాన్సెన్సు! పిల్లకు పాలిచ్చే సీతను, చెడబాదేశాడు ...బాదడంలో తనకు డబ్బు కావాలన్నాడండోయ్!....సీత ఏడుస్తూనే ఉంది. అదెంత నేరం మరి:.... తన చెయ్యి నొప్పిపెట్టేవరకూ కొట్టి వెళ్ళిపోయాడు ఇంత ఘనంగా, పురుషుల ఆధిక్యతను నిలబెడుతున్నాడు గనకనేను, అతని గురువర్గానికి తనమీద అంత అమిత ప్రేమ.

సీత కనుకొలకుల నుండి నీరు ధారగా ప్రవహిస్తున్నయ్. క్యారు క్యారుమని ఏడుస్తున్న చంటిబిడ్డ నిద్రపోయింది. దీనంగా. దిగులుగా. వ్యధిత హృదయంతో. వినీల ఆకాశంలో బంతుల్లా వ్రేలాడుతున్న నక్షత్రరాసులవంకచూస్తోంది. ప్రకృతి అంతా తనుచూచి పరిహసిస్తోం దన్నట్లుగా సీత మరింత వెక్కివెక్కి ఏడుస్తోంది.

"నేను మీకేం అపకారం చేశాను? మీరావిధంగా నన్ను ఎందుకు పరిహసిస్తారు?....నన్ను చూస్తే మీకు జాలికలగడంలేదా?" అన్నట్లు సీత నక్షత్రాలను వేడుకుంది,

ఇంతలో తనఆరేండ్ల కొడుకువచ్చి "ఎందుకమ్మా! ఏడుస్తున్నావ్? ....మళ్లీ నాన్న కొట్టాడా?" అని అశ్రుపూరిత నయనాలతో అడిగాడు.

"లేదు బాబూ లేదు" అంటూ తన కండ్లను తుడుచుకుంది.

"అమ్మా, నాన్నమంచివాడుకాదు కదూ!....నేనే పెద్దవాణ్ణిఅయితే, నిన్ను కొట్టనిస్తానా?" అన్నాడా పసిబాలుడు.

అఘమూ శుభమూ యెరుగని ఆ అమాయక పసిహృదయంలోనుండి వచ్చిన ఆ ఓదార్పుమాటల్లో, విశ్వమంతా తన్నూరడించిందనుకుంది. ఆ చిన్నబాలుడు తల్లిహృదయాని కెంతో మహదానందాన్ని కల్గించాడు,

చంద్రం తన ఆధిక్యతా కార్యక్రమాన్ని ముందుమాటలతో ప్రారంభించి, దెబ్బలతో సాగించి, చివరకు ఏ కార్యక్రమంతో అంతం చేస్తాడో? చంద్రానికి రాను రాను భార్యయెడ వైముఖ్యం ఎక్కువవుతూండడమే గాక, చులకన భావం, హీనభావం నానాటికి శృతిమించి రాగాన పడుతూండడానికి కారణం?

చంద్రం ఆ విషయాన్ని గురించి, పరిశోధించి, పరిశోధించి తెల్సుకున్నాడు. మీరు తెలుసునో లేదో: ఆతడు కనిపెట్టిన పరిశోధన సారాంశం, బహుశా స్పుత్నిక్ కనిపెట్టిన శాస్త్రజ్ఞులకు కూడా సాధ్యం కాదేమో!....అంత గొప్ప పరిశోధన! సీత మాట్లాడే ప్రతి మాటలోనూ, చేసే ప్రతి పనిలోనూ ఒక లోపాన్ని చూడడమనేది అతడు పరిశోధించి తెల్సుకున్నాడు. అతనిలో చూస్తుండగానే ఎంత మార్పు! తనలో కల్గిన మార్పునే సీతలో చూచి ఆమెలో వచ్చిన మార్పుగా చిత్రించుకుని తనకు కావలసిన డబ్బునూ, ఆనందాన్నీ యివ్వడం లేదని, తనపురుషాధిక్యతను ధిక్కరిస్తోందని ఊహించుకుని ఈ దెబ్బల కార్యక్రమాని కుపక్రమించాడు. సామాన్యమా ఈ విషయం!

అంతేకాదు, వివాహంనాటి అందం, సీతలో గతంలో కన్పించిన కోమలత్వం, లాలిత్యం, ఇప్పుడతని కండ్లకు కన్పించందే అతడేం చేస్తాడండీ మీరందరూ అతణ్ణి ఊరికనే వేసుకు పడతారుగాని !

# 2

పట్టణమేమో, రాత్రి అయినా, సందడికేమాత్రమూ లోటులేదు. మొదటి ఆట సినిమా వదలిపెట్టే టైం అవవచ్చిందని, జనం సినిమాకు వెళ్ళాలని అతృతగా నడుస్తున్నారు. ఇంటి వద్ద టైం చూసుకొనిబయల్దేరినవాళ్లు నెమ్మదిగా నడచుకుంటూ పోతున్నారు. అందులోనూ, రోజులను బట్టి స్త్రీలుకూడ సినిమాలకు వెళ్ళడం ఒకఅలవాటైపోయింది గదా? స్త్రీలు వెడుతూంటే, వారిని గురించి ఏవేవో వ్యాఖ్యానాలు చెయ్యకుండానూ, వారిపై నాలుగు విసుళ్లు విసరకుండానూ ఉంటే తమ పాండిత్య ప్రదర్శనావకాశం జారిపోయినట్లే, తమలో మూర్తీభవించిన ఆధునికత్వమంతా గంగలో కలిసి పోతున్నట్లు భావించే కొంతమంది యువకుల కోవకు చెందిన ముగ్గురు యువకులు నడుస్తున్నారు. వారికి ముందుగా కొంచెం దూరంలో, ఒకస్త్రీ నడుస్తూంది. ఆమెకుకొంచెం ప్రక్కగా ఒకయువకుడు నడుస్తున్నాడు.

ఆ ముగ్గురు యువకులకు ఆ స్త్రీ విషయం తెలిసే ఉండవచ్చునేమో !

"దీనికేం దశ పట్టిందిరా!...." అన్నాడొక యువకుడు.

"అరే! ఇంకా నేల మీదే నడుస్తోందే?" అని మరొకడు అంటూంటే, ఆస్త్రీ తనలో తాను నవ్వుకుంటూ, నెమ్మదిగానే నడుస్తూంది. ఆమె ప్రక్కగానే ఉన్న యువకుడు, అనే వాళ్లవంక చూస్తున్నాడప్పుడప్పుడు. వాళ్ళమాటలాయువకునికి సుతరామూ గిట్టటం లేదు.

ఆ ముగ్గురు యువకులు ఏమీజంకూ గొంకూ లేకుండా, నెమ్మదిగా కూడ కాదు- బిగ్గరగానేమాటలు అంటున్నా వాళ్ళ మాటలనేం లక్ష్య

పెట్టడం లేదు అస్త్రీ. అలాంటి యువకులకు మంచీ, చెడులతో నిమిత్త మేముంది కనుక?....స్త్రీ కనుక?....స్త్రీ కనుపిస్తే, చులకనగా నాలుగు మాటలంటే చాలు వాళ్ళ సరదా తీరిపోతుంది! అంతటితో వాళ్ళు ఊరుకుంటారా?

"అబ్బా! ఇది రోజురోజుకు పడుచుదై పోతూందిరా" అన్నాడు ఒకడు.

ఆమాట కామె లోలోన మురిసిపోతూ, నడకలోగల వయ్యారాన్ని పెంచింది. ఆరోడ్డుపై ఒయ్యారాన్ని ఒలకపోస్తోంది.

"అబ్బా! ఏం నడకండీ!....జాగ్రత్త! పడేవు. అన్నాడు మరొకడు.

ఆ మాటలో ఆ యువకులు వాళ్ళలో వాళ్లు విరగబడి నవ్వు కున్నారు. ఆమె తన ప్రక్కనున్న యువకునితో "నేను బాగా బ్రతికి పోతున్నానని ఈర్ష్య వచ్చినోళ్ళకి." అందామె.

"ఎవర్నో నాలుగు పిక్కలున్న వాణ్ణి పట్టినట్లుంది. ఎక్కడా భూమ్మీద ఆగడంలేదు" అన్నాడొకడు.

"కనపడ్డంలా" అన్నాడు మరొకడు. ఆమె ప్రక్కన నడిచే యువకుని వంక చూపుతూ.

ఈ మాటలు ప్రక్కన నడిచే యువకునికి ములుకుల్లా తగు ల్తూన్నయ్. ఆ ముగ్గురి యువకులు పట్టి మూర్ఖులనుకున్నాడు "ఆడ దంటే వీళ్ల కింత అలుసా? ఇంత హీనభావమా! అన్న భావం అతణ్ణి ఉద్రిక్తుణ్ణి చేసింది. కోపంపట్టరానంతగా అతనిలో విజృంభించింది వెధవ న్యాయశాస్త్రం అతని కడ్డుపడిందికాని, లేకపోతేనా; ఆ యువకుడా క్షణంలో వాళ్ళముగ్గురి పీకలను తన స్వహస్తాలతో ఆ నడి రోడ్డుపై అమాంతంగా నలిపివేసి, స్త్రీఅంటేఅతనికున్న గౌరవభావాన్ని చాటి తన వీరత్వాన్నికూడా ప్రదర్శించేవాడే! పై పెచ్చు యీ చట్టాలు అతనికి దొరకిన ఒక సదవకాశాన్ని పోగొట్టడమేగాక అతని చేతికి సంకెళ్లు

కూడా వేశాయ్! ఈ చట్టాలన్నీ పెద్దవాళ్ళకే, రక్షణ కల్పిస్తున్నయ్యను కున్నాడు.

"రౌడీలు -" అని గొణుక్కున్నాడు. ఇది ఆమెకు విన్పించింది. "పోనిద్దురూ! పోకిరీచచ్చినోళ్ళకేముంది? వాగివాగి వాళ్ళే ఊరుకుం టారు" అని అతని కోపంపై నీళ్లు చల్లింది. దాంతో ఆమెపై గౌరవ ముంచి, వాళ్ళపై చేయి చేసుకోకుండా ఊరుకున్నాడు,

ఈ యువకుని ఉద్దేశించి-

"ఈ విశాల ప్రపంచంలో ఈ పడుచే కావలసి వచ్చిందా నాయనా? అన్నాడు వారిలో ఒకడు.

తానుపెద్దమనిషిలా, మరొకడు "పోనియంర్రా - అదేమిటిప్రేమ! ప్రేమరా!" అన్నా డింకొకడు వెకిలిగా.

ఈ మాట లా యువకుణ్ణి ఉద్రేక పరిచినాయ్. నడిచే వాడాగి వాళ్ళ వంకచూశాడు. "సిగ్గూ ఎగ్గూ లేని వాళ్ళకేముంది?" అని అతని చేయిపట్టుకుని ఆమె అపింది. పౌరుషవంతుడు 'అంతేలే' అని ఆగి పోయాడు.

"నువ్వన్నది నిజమేలే" అని వాళ్ళ ముగ్గురూ చప్పట్లుకొట్టారు.

స్త్రీ గౌరవంకోసం ఇంతగా తాపత్రయ పడ్డవాడు చంద్రమా? చంద్రమే? .... ఆ! చంద్రమే! ముమ్మాటికి చంద్రమే!

ఆవిడపేరు తాయారమ్మ. నలభై యెదుయేళ్ల నవయవ్వని-చక్కగా సింగారించుకుని, బర్మాముడి వేసి, ముడిచుట్టూ పువ్వులతోరళములతో ఒయ్యారంగా రోడ్డుమీద నడుస్తుంటే, ఆ కొంటె యువకులెలా ఊరుకో గలరు?

*　　*　　*　　*

పంపుదగ్గర ఇప్పుడు తాయారమ్మ ఒక పెద్ద ఆకర్షణ. అక్కడ చేరే నలుగురు అమ్మలక్కలూ ఆమె వేషాన్ని పట్టి పట్టి మరీ చూసే

వారు. కొన్ని నెలల్లో ఆమెలో ఎంతమార్పు! తోసుకుపోయిన దవడలు మరల పుష్టిని సంపాదించాయి; కొత్త అందం ఆమె నలంకరించింది. చెవులపై కొత్త నమూనా రాళ్లజోడు ఇతరులనుచూసి వెక్కిరిస్తున్నది. మెడలో ఒక నెక్లెస్ ఆమె కంఠాన్ని కౌగలించుకుని ప్రతి వారిని ఆకర్షిస్తోంది.

"ఇవన్నీ ఈ కొత్తాయనే చేయించాడేమే" అని ఆడిగారు లోలోపల ఈర్ష్యతో.

"అవును" అంది సిగ్గు నభినయిస్తూ తాయారమ్మ.

"దానికేంలే! రాహువు తిరిగింది" అంది ఇంకో ఆవిడ.

"కాకపోతే ఏమిటిలేవే! రోజులెప్పుడూ ఒక మాదిరిగానే ఉంటాయేమిటి? నాలుగురోజు లమావాస్య, నాలుగురోజులు పౌర్ణమి" అంది. ఆరితేరిన ఇంకో ముసలమ్మ,

ఇవన్నీ వింటూంటే తాయారమ్మకు నిజంగా స్వర్గంలో విహరించి నట్లే ఉంది! 'నిజం! దేవేంద్రుడామె నీ వయస్సులోనైనా సరే, పిలవ లేదు గాని, పిలిస్తే రంభకు గర్వభంగంచేసి వచ్చేదాన్నే' అనుకుంది. ఎవరి అందం ఎవరికి ఆకర్షణగా ఉండదు చెప్పండి!

ఆ ముసలమ్మా, తాయారమ్మే ఉన్నారు పంపువద్ద.

"నేను చెబుతున్నా పెద్దదాన్ని, వయసులోనా, నువ్వు ఉన్నవాణ్ణి సంపాయించ లేక ఏడ్చావు....నీ అదృష్టం కొద్దీ వయస్సుడిగినా, నాలుగు పిక్కలున్నవాడే దొరికాడు. జారి పోనియ్యకు!" అని ఆ ముస లమ్మ సలహా చెప్పింది.

నాకు చాతనైనంతవరకూ ప్రయత్నిస్తున్నానే....ఎన్ని చెప్పినా మగవాడే కదా!" అంది తాయారమ్మ.

"ఓసి నీ తెలివి తెల్లార!....ఆడది సరైందయితే, మగాడు కుక్కలా పడిఉంటాడే" అని, ఒక తత్వం చెప్పేసింది,

గతంలో బిందెలు మోసిమోసి కాయలుగట్టిన తాయారమ్మ భుజం, నేడు బిందె భుజంమీద పెట్టుకుంటానికి వెనకాడుతోంది. గతంలో చీర మాటున, పేదరికంతోనూ, రోగాలతోనూ వయస్సుడిగిన బలహీన శరీరం, నేడు పునరుజ్జీవం పోసుకొని క్రొత్తచీరల్లో క్రొత్త జీవం పోసుకుంది. ఇదంతా, సీతపద్ద పురుషుని ఆధిక్యతను ప్రదర్శించే చంద్రం చలవే!

అంతటితో ఆగిపోతే చంద్రం, పురుషాధిక్యతను కోరే తన గురు వర్గానికి అపచారం తలపెట్టినవాడికిందే జమకట్టుకునేవారే పాపం!.... జరిగిన దాని కేంచేస్తా రెవరైనా!

సాయంత్రం మూడుగంటలైంది. మంచమ్మీద తాయారమ్మ ఏదో బాధతో మూల్గుతోంది. చంద్రంకూడా మానవుడేకదండీ!....సీత అంటే బానిసకాని, తాయారమ్మ కాదుగా మరి! ఆమె బాధనుచూస్తూ ఊరుకోలేక ఆమె పాదసేవచేస్తూ, మధ్య మధ్యలో ఆమె నుదుటిపై చేయివేసి నొప్పి తగ్గినదేమో అడుగుతున్నాడు. పని మనిషిరాని కారణంగా అతడే బొగ్గులపొయ్యి వెలిగించి వేడినీళ్ళు అంతకుముందుగానే పెట్టాడు; ఇంత లోనే అతని సేవకు అంతరాయం కలిగించింది. తాయారమ్మకు సలహా చెప్పిన ముసలమ్మ వచ్చి,

"ఏమే ఎక్కడా కనపడ్డమేలేదు. ఎంత ముచ్చటైన మొగడు దొరికితే మాత్రం" అంది ముసలమ్మ.

ఆ మాటలను చంద్రం మహదానందాన్ని పొందాడు. ఆ చుట్టు ప్రక్కల తన పేరును ఎంతమంది స్మరిస్తున్నారో ఇప్పుడు స్పష్టంగా గ్రహించాడు. 'టీ' పట్టుకురావడానికి ఫ్లాస్కుపుచ్చుకుని చంద్రం వెళ్ళిపోయాడు.

"నువ్వు చెప్పినట్టే చేస్తున్నానే. నామాట దాటడుగా! ఏం చెప్పినా చేస్తాడే" అంది తాయారమ్మ.

"చేయకేంచేస్తాడు! నే చెప్పలా! పెళ్లాంమాట ఎత్తుతాడా?"

"ఆ గొడవేలేదే!....ఇప్పుడు పనిమనిషినిగూడ పెట్టాడుగా" అంది తాయారమ్మ,

"ఏం అట్టాఉండావే."

"ఏం బాగాలేదే....నన్నునిముషం వదలిపెట్టడు ఏంచెయ్యను చెప్పు-అందుకే కనబడ్డంలేదు" అంది తాయారమ్మ,

అట్టాగే ఉండవే....నాలుగుడబ్బులు వెనకేసుకో"మని చెప్పి వెళ్ళిపోయింది ముసలమ్మ.

తాయారమ్మ మాటల్లో ఏమీ అతిశయోక్తిలేదు. చంద్రం తాయారమ్మకు దాసుడే. అట్లాఅంటే, చంద్రం గురువర్గానికి కోపంవస్తుందేమో కాని (ఎవరికైనా వున్నసంగతి మాట్లాడితే కోపమే!....) ఆమె మాట లతనికో సంగీతం-ఆమెస్పర్శ అతనికో మధురానుభూతి....మరి పాపం: సీత సంసారిగనుక, ఈ మాయటక్కులు చేతకాక, తెలివితక్కువదై పోయింది....అల్లాంటి తాయారువద్ద బజారులో వ్యాపారివద్ద పొందే ఆనందం, చంద్రానికి యింట్లోవున్న సీతవద్ద ఎలాదొరుకుతుంది ?.... అందుకే తాయారమ్మ ఆజ్ఞ చంద్రానికి సుగ్రీవాజ్ఞ !

చంద్రం గురువర్గాని కిప్పుడు పెద్దచిక్కు వచ్చింది....వాళ్లు చంద్రం యిట్లా ఎందుకై పోయాడని ఆలోచించడం ప్రారంభించారు. తా నీ విధంగా తనకు తెలియకనే దాసుడై పోయాడు చంద్రం.... వేశ్యాసంపర్క ఫలితమే....వేశ్యలలో ఈ తాయారమ్మ అతనికి రంభ.... కారణం. అతను మాత్రం ఏం చెప్పగలడు ?

అతణ్ణి సన్మానించాలని అనుకున్న అతని గురువర్గమంతా చీదరించుకుని, శాపనార్థాలు పెట్టారు ! 'ద్రోహి' అన్నారు. ....పాపం శమించుగాక !....

దానికి సమాధానంగా, శిష్యుడు చంద్రం మాత్రం పశ్చాత్తాపంతో ఊరుకున్నాడా ?....ఊరుకోలేదు.

"పురుషాధిక్యతను కోరే పురుషుల్లారా! ...ఆచరణలో మీరా యింతే! మీ జీవితాలు తడిమిచూచుకోండి" అన్నాడు.

"భార్య విషయమో?" అన్నారు వారు.

"అది నాయిష్టం. నాకు సర్వాధికారాలున్నయ్" అన్నాడు.

దాంతో కొంత సంతృప్తి పడ్డారు చంద్రం గురువర్గంవారు, వాళ్ల నుద్దేశించి నెక్స్టు టైమ్ బెటర్ లక్ అంది లోకం.

"భర్తకు సర్వాధికారాలున్నమాట త్రేతాయుగంనాడు. కలియుగంలో కాదు" అంది కలియుగ సీత. సీతతోపాటు ఆధునిక నారీలోకం ముక్త కంఠంతో....



# దైవభక్తుడు

సుబ్బారావుకు పన్నెండేళ్ళున్నప్పటి సంగతి. అతడు రెండవ ఫారం హైస్కూలులో చదువుతున్న రోజులు. అప్పటినుండి సుబ్బారావుకు నాగేశ్వర్రావుతో పరిచయం కాస్త సన్నిహితమైంది. దాంతో సుబ్బారావు, నాగేశ్వరరావు గారింటికి రావడం, పోవడం ఎక్కువైంది. వారిద్దరు ఒక గ్రామానికి చెందినవారే. సుబ్బారావు, నాగేశ్వర్రావు యింటికి ఎప్పుడు వెళ్లినా, నాగేశ్వరరావు దీర్ఘంగా చదువులో నిమగ్నుడయి ఉండడమో, లేక ఏదో పుస్తకం చేతిలో ఉండడమో, సాయంత్రం పూట, భగవత్కాలక్షేపమో - భగవత్కాలక్షేపమన్నది నాగేశ్వర్రావు పదమే సుమాండీ- జరుగుతూండేది. అప్పటికి నాగేశ్వరరావుకు మహా ఉంటే నలభై ఏళ్లు నిండీ నిండడమే. ఆయన ప్రవర్తన సుబ్బారావు కెంతో చిత్రంగా కనుపించేది. ఆ ప్రవర్తన, పెద్దల దృష్టిలో ఒక విశిష్టమైన దనుకోండి!

ఆయనకు గంపెడంత మేడ ఉంటే, ఆ మేడ తనదికాదు, తన కెందుకన్నట్లు, మేడముందు వరండాలో ఒక సిరిచాప వేసుకుని, ఒక భగవద్గ్రంథంతో కూర్చుని ఉండేవాడు. సాయంత్రంపూట భగవత్కాలక్షేపమపుడు, ఆ వరండాలోకే, చుట్టుప్రక్కలవారు కూడ కూడేవారు. ఆ సమయంలో ఎవరైనా తెలీక రానివ్వండి, తెలిసి రానివ్వండి, పాలేళ్ళు కానివ్వండి లేదా లౌకిక వ్యవహారములకు సంబంధించిన వారెవరైనా రానివ్వండి, వాళ్ల కెవ్వరికీ ఆయన ఇంటర్వ్యూ యిచ్చేవాడు కాదు. అంతటిలో ఆగితే బాగానే ఉండును. ఇహలోక సంబంధాలపట్ల తన తీవ్ర వైముఖ్యాన్ని ప్రదర్శిస్తూ, మరోరోజు, తన తీరికసమయంలో అంటే అర్థం- ఇహలోకపు సంబంధాలకు ఆయన కేటాయించిన సమయమూ ఆయన ఒంటరిగా ఉండే వేళనీ అన్నమాట - రమ్మని చెప్పేవాడు. దాంతో, అక్కడ కూడిన ఆడ మగ అందరూ, ఆయన ఒకపెద్ద జ్ఞాని కాక తప్పదనీ. అది పూర్వజన్మ విశేషమనీ సంసారం

పైన మోహాన్ని ఆ వయస్సులో వదిలించుకోవడమంటే చాల కష్టమనీ, పొగిడేవారు. ఆ మాటలు విని ప్రశాంతంగా....

'మీ ఆశీర్వచనం, భగవంతుని ఆశీర్వచనం అట్లా ఉంటే, జీవికి కావలసిం దేముంటుంది?.... ఇంకా ఈ మాయా ప్రపంచపు బంధనాల నుండి విముక్తి కలగాలంటే ఇంకా ఎంతో కృషిచేయవలసి ఉంది. అట్లా సంపూర్ణంగా వదిలించుకున్నవాడే నిజమైన జ్ఞాని కాగలడనీ, నా విషయంలో దైవనిర్ణయం ఎలా ఉంటుందో' అని అనేవాడు. మనిషికి కలిగిన వాడినికదా అన్న ఆడంబరం లేదు. చొక్కా వేయకుండా, కండువా కప్పేవాడు. ఒక ముతక పంచె. అలాంటప్పుడు, గొప్ప కోసం, ఆడంబరాలకోసం తాపత్రయపడే ఈ లోకానికి అతని వేషంలోనూ, ప్రవర్తనలోనూ విశిష్టత కనుపించదూ మరి! అలాంటప్పుడు కుర్ర వాడైన సుబ్బారావుకు చిత్రంగా ఉండడంలో అబ్బుర మేముంది!

ఇక్కడ ఒక విషయం చెప్పడం మరచిపోతే, నాగేశ్వరరావుగారి యెడ అన్యాయం తలపెట్టినట్లే అవుతుంది. భగవత్కాలక్షేపానికి వెళ్ళే వారు, ఆయన ఎదుట అనుకునే మాటలకన్నా, చాటుగాకూడ అంతకన్నా గొప్పగా మాట్లాడుకునేవారు. 'ఆహా! ఈ ప్రపంచంలో పుట్టి ప్రపంచంలో, తామరాకుపై నీటి బొట్టులా అంటీ అంటనట్లుగా ఉండడం ఆయనికే చాతనైంది సుమా, అని ఒకయ్యగాని, ఒకమ్మగాని అంటే, మరో అయ్యగాని, అమ్మగాని, "చాత కావడమే కాదు. ఆయనమోక్ష దశకు రావడాని కవుసరమైన త్యాగాన్ని చేస్తున్నాడు" అనేవారు. ఆ విధంగా దైవభక్తుడని, ఉత్తముడనీ, నలుగురి తోనూ పిలిపించుకుంటున్నాడు. ఆ అనేవాళ్ల నలుగురూ సంఘంలో బలమున్న పెద్దలే. ఈ సమాజంలో, వాళ్ల గుర్తింపే ప్రజల గుర్తింపయి పోయిందన్న మాటే.

ఈ విషయాలన్నీ అదేపనిగా చూస్తున్న సుబ్బారావుకు, కొన్ని ధర్మసందేహాలు వచ్చినయ్. అది ఆనా డెందుకు వచ్చాయో చెప్పమంటే, సుబ్బారావు ఈనాడేం చెప్పలేడు. అసలు సుబ్బారావు సందేహాలతో

సతమతమయ్యే కుర్రవాడు. ఒకరోజున నాగేశ్వర్రావు ఎదుట తన సందేహాన్ని ఈ మాటల్లో పెట్టేశాడు. ముందు తటపటాయిస్తూ "మిమ్మల్ని ఒక విషయం అడగా లనుకున్నాను" అని మొదలు పెట్టాడు.

"అడుగుబాబూ" అన్నాడాయన ఎంతో ఆప్యాయతను ప్రదర్శిస్తూ.

"ఎప్పుడు చూచినా మీరేవో పుస్తకాలు చదువుతూంటారే. ఏం పుస్తకాలండీ అవి?" ఆ ప్రశ్నను, నాగేశ్వర్రావు భార్యకూడా విని, నాగేశ్వరరావును చెప్పనివ్వకుండానే,

"నీ కెందుకులే బాబూ ఆ గొడవ. తెలుసుకుంటే నీవు చెడి పోతావు" అంది.

"విన్నావా మీ అత్తయ్యమాటలు. అజ్ఞానులట్లాగే అంటారు. నేను చదివే పుస్తకాలు మీవంటివారికి పనికివస్తాయా? ఇవన్నీ, దైవం, జ్ఞానం, భక్తి, మోక్షాలను గురించిన ఉద్గ్రంథాలు" అన్నాడు నాగేశ్వర రావు.

ఈ మాటల్లో 'దైవం' అన్నమాట తప్ప, మిగతామాటలు అర్థం కానివా డూరుకోవచ్చునా? సుబ్బారావు 'జ్ఞానమంటే ఏమిటి!' అని ప్రశ్నించాడు ఒకవేళ చెపితే తన కర్థమవుతుందన్నట్లు.

"అది చాలా పెద్దప్రశ్న. అది మహాయోగులకే తెలియని ప్రశ్న. అది తెలిస్తే సర్వమూ తెలిసినట్లే" అన్నాడు నాగేశ్వర్రావు.

"అంత పెద్దప్రశ్న వేసినందుకు సుబ్బారావు పొంగిపోయి ఇంటికి వచ్చి అమ్మతో, 'నాగేశ్వర్రావు మావయ్య పప్పులో కాలేశాడు. నా ప్రశ్నలో" అని జరిగినదంతా చెప్పాడు. కొడుకు తెలివికి అమ్మ మురిసిపోయింది. అయినా, ఆయన జవాబుచెప్పలేక పోవడమేమిటనుకుని 'ఆయన చాల గొప్పవాడు. పెద్దపెద్ద వేదాంత గ్రంథాలన్నీ కంఠస్తంరా" అంది.

మొత్తంమీద సుబ్బారావు చిన్న మనసులో కల్గిన యీ సందేహం, వయసువచ్చిన కొలది మనసులో రేగిన తుఫానులు, చివరకతణ్ణి భౌతిక

వాదిగా తయారుచేశాయి. దానికి కారణాలు కూడ చాలా వున్నాయి. అవన్నీ ఇప్పుడనవసరం.

భగవత్కాలక్షేప సమయంలో నాగేశ్వరరావు, సుబ్బారావు దొడ్డ ప్రశ్న ప్రశక్తితెచ్చాడు. ఆ ప్రసక్తిపై నాగేశ్వరరావు భార్య కలుగ చేసుకొని సుబ్బారావు తల్లితో "మీ అన్నయ్య కెప్పుడూ ఈ గొడవే. సంసారం గొడవే పట్టించుకోరు. నా సంగతి సరేసరి. నా మాటంటేనే మీ అన్నయ్యకు మంట. పోనీ పిల్లలు గుడ్డలు లేవని గొడవచేస్తే 'ఉన్నవాటితో సర్దుకుంద్రూ. ప్రపంచం కాదంటుందా? అందానికి, ఆడంబరానికి, గొప్పలకు అంతెక్కడ?' అని ఛీదిరించేస్తారు" అని భర్తమీద ఒక నేరారోపణ చేసింది.

"వింటున్నారా? .... ఎట్లా నన్నే పీక్కుతింటున్నారో?" అన్నాడు నాగేశ్వరరావు.

"అందుకేగా గృహస్థుడు మోక్షం సాధించడంలోనే మహా గొప్పతనముందని వేదాంతం చెప్పేది." అని సుబ్బారావు తల్లి వేదాంతాన్ని వల్లించేసింది ఆరిందాలాగా.

— నాగేశ్వరరావును స్తుతించేటట్లు చేయాలనే సంకల్పంతో, ఆ ఫిర్యాదు చేయలేదు నాగేశ్వరరావు భార్య. ఆమె ఫిర్యాదు నిజంగానే నమ్మి చేసింది. ఆమె మాటల్లో అక్షరం కూడా అబద్ధంలేదు.

కాని ఆమె అమాయకత్వానికి, శుద్ధ తెలివితక్కువతనానికి జాలి పడాలి. ఎందుకంటే, ఇంతకాలంగా ఆయనతో సంసారంచేసి, ఆయన మనసును, మనస్తత్వాన్ని అర్థంచేసుకోలేకపోయింది. బహుశా, ఆమె తెలివితక్కువతనాన్ని నిందించడం కూడా పొరబాటేమో. నాగేశ్వరరావు ప్రవర్తనకూడా ఎంతో చాకచక్యంతో కూడివుండేది. ఆయన మనస్తత్వం అర్థం చేసుకోడానికి ప్రత్యేక కృషిచేస్తేతప్ప లేకపోతే తెలుసుకోవడం కష్టమే.

"అంగన నమ్మరాదు" అన్న మాటలను ఆచరణలోపెట్టి, భార్య ఎదుట తన మనస్సును విప్పేవాడు కాదు. కొడుకులకు "శ్రీగల భాగ్యశాలి కడ చేరగవత్తురు" జాగ్రత్త సుమా అని, లోకంపోకడను గురించి హెచ్చరించేవాడు. కాని తన వ్యవహారాలు, అంటే వడ్డీవ్యాపారం విషయం. ఎవరెవరికిస్తున్నాడో, ఎంత వడ్డీతీసుకుంటున్నాడో తనకుతప్ప, ఇంట్లో వారికి తెలియనిచ్చేవాడుకాదు. బయటవాళ్ళ విషయంలో అతని ప్రవర్తన చెప్పనే అక్కరలేదు.

అవునులెండి పాపం! నాగేశ్వరరావుమాత్రం ఏంచేస్తాడు చెప్పండి. మట్టిలో కలిసి పోయే ఈ పాడు భౌతిక దేహం తెచ్చే చిక్కులకూ, కోర్కెలకూ, ఒకసారి కాకపోయినా మరోసారి అయినా లొంగక అతనికీ తప్పేదికాదు. ఎంతో బాధలోనే కోర్కెలన్నిటికీ బానిసై పోయే వాడట - ఏదైనా 'కామం' గురించి చర్చవచ్చినప్పుడు, అది భారతీయ సంప్రదాయమైనట్లు తనగురువుగారు చెప్పారని, సంతానోత్పత్తి ఉద్దేశ్యం తోచినపుడు మాత్రమే కామం కామం కాదని, నిషిద్ధం కూడ కాదని ఆయన చెబుతూంటాడు కూడ. సుబ్బారావుకు కొంచెం పెద్దవాడైన తర్వాత, ఆ మాటలు తమాషాగా కన్పించలేదు సరిగదా, మోసంగాకూడ కన్పించాయ్.

ఆయనమాత్రం ఏం చేస్తాడు చెప్పండి పాపం? ఎంత కాదన్నా ఆయన విరాగికాడు కదా ఎవరైనా వేలెత్తి చూపేందుకు! ఏమంటారు? ఒకరోజున నాగేశ్వరరావు, మహేశ్వరితో మాట్లాడుతూ తన బలహీనతను ఒప్పేసుకోవడం సుబ్బారావు వినడంకూడా జరిగింది.

"ఏ ముందండి! ఈ ప్రపంచం మాయ. మన సంసారమా ఒక మోహసముద్రం. ఎంత తన్నుకున్నా, ఈ సముద్రంలో నుండి బయట పడే మోక్షమార్గం కన్పించడం లేదండి" అన్నాడు నాగేశ్వరరావు, రెండవ వ్యక్తితో.

నిజమే లెండి. మీ మాత్రం సాధించడం సామాన్యునికి చాతనవు-

తుందా?.... ఈ జానెడు పొట్టక్షోభ ఎక్కడ తప్పించుకో గలమండి?" అని ఆయన్ను సమర్థించాడు రెండో వ్యక్తి.

"బాగా చెప్పారు .... అందుకే అనుభవజ్ఞులైన వేదాంతులొక విషయాన్నికూడ చెప్పారండోయ్. ఏమిటంటే, మన అంతరాత్మను బాధించి ఏ పనిని సాధించినా ప్రయోజనం శూన్యం అని సెలవిచ్చారు. అందువల్ల మన ప్రాణానికి అవుసరమైన ఆహారమూ తినకతప్పదు. ప్రాణం ఉంటేనే గదా మోక్షం సాధించేది?

"అది సాకుగా చేసుకుని, భోగ లాలసత్వంలో మానవు డెక్కడ జారుకు పోతాడో అని భోగలాలసత్వాన్ని ఖండించారు. భోగలాల సత్వంలో మనం దైవాన్నే మరిచి పోవచ్చుగదా."

"చాలాబాగా శెలవిచ్చారు. మొత్తం మీద వేదాంతాన్ని కరతలా మలకంగా చేసుకున్నారండీ నాగేశ్వరరావుగారూ. మీరు గురూపదేశం పొందింది ఎవరివద్ద?"

"రమణ మహర్షిగారి వద్ద" అన్నాడు నాగేశ్వరరావు.

"అద్గదీ - అలా చెప్పండి" అని, రెండోవ్యక్తి శెలవు తీసు కున్నాడు. సుబ్బారావు ఇప్పుడు వయసు వచ్చిన వాడైనా, నాగేశ్వర్రావు మాటలతనికి క్షుణ్ణంగా అర్ధమూ కాలేదు. ఆ మాటల వెనుక దాగిన నాగేశ్వర్రావు ప్రవర్తనా అర్థమూ కాలేదు.

అలాంటపుడు. నాగేశ్వర్రావు భార్య కేమర్థమవుతుంది? నలుగురి లోనికి వెళ్ళినపుడు తమ గొప్పను ప్రదర్శించడానికి బాగా నగలు, పట్టుచీరలు కట్టుకోవాలని ఆమె ఉబలాటపడుతుంది. అదే విధంగా కొడుకులూ అట్లాచేస్తే, కూడ బెట్టినసొమ్ము దుర్వ్యయం అయి, ఖజానా ఖాళీ అవుతుందని నాగేశ్వరరావు తాపత్రయం. అదీ భౌతిక ప్రపంచంతోపాటు కొట్టుకుపోయే నాగేశ్వర్రావు కుటుంబానికీ,

దైవభక్తుడు, ఉత్తముడుగా, జ్ఞానిగా పలామణీ అయ్యే నాగేశ్వరరావుకూ తేడా....నిజంగా జ్ఞాని నాగేశ్వరరావు గాక, మిగతావాళ్లెలా అవుతారు?

పై సంభాషణ విన్న సుబ్బారావు ఊరుకున్నాడూ? .... అతనికీ తత్వవాదస్తమూ ఉందిగా. "కండ్లకు కనుపించే ప్రపంచాన్ని మాయగా ఎలా అనుకోగలం? అసలు ఆ వాదనలో నిజంగా ఔచిత్యం ఏముంది?" అని ప్రశ్నించాడు. ఇప్పుడు సుబ్బారావు కొంచెం పెద్దవాడయ్యాడుగా. దానికి సమాధానం ఏంచెప్పాలో వెంటనే నాగేశ్వరరావుకు తోచక, కొంచెం ఆలోచించి "ఏమో నాయనా, మీ ఇంగ్లీషు చదువులవల్ల మీరీవిధంగా పాడయిపోయారు" అని తప్పించుకున్నాడు. సుబ్బారావు తాను జయాన్ని సాధించినట్లుగా వెళ్ళిపోయాడు.

సుబ్బారావు ప్లీడరీ పరీక్ష ప్యాసై, పట్టాకూడ సంపాదించాడు. తల్లిమాట మీద, సుబ్బారావు తన పట్టా తెచ్చుకున్న విషయం చెప్పి, ఆశీర్వచనం పొందాలని నాగేశ్వరరావు యింటికివెళ్ళాడు. 'భగవద్గీత' గ్రంథం చదువుతున్నాడు. ఆయనతోపాటు, సుబ్బారావుకూడ, యోగి చాపమీద ఆసీనుడయి. తన విషయం చెప్పాడు. సుబ్బారావు మాటలు నాగేశ్వరరావు సావధానంగా విని,

"నేనిట్లా అంటున్నానని ఏమనుకోకు బాబూ .... చదవగా, చదవగా, అబద్ధాలాడి బ్రతుకవలసిన చదువెందుకు చదివావయ్యా?" అని చలిచీమలా వదిలాడు.

ఇంత కష్టపడి చదువుకుని, సమాజంలో ఒక విశిష్టస్థాన మున్న దనుకుని భావించే సుబ్బారావుకు ఆమాటలు శూలాల్లాగా గుచ్చుకున్నయ్. కుర్రతనంలో అయితే, ఆ మాటలకు, చటుక్కున నోటికి వచ్చిన జవాబు చెప్పేవాడే. కానిపుడు తానిపుడు పెద్దవాడు కావడమే గాక, లౌకికంగా వ్యవహరించవలసిన వృత్తికూడానేమో, నోటికి వచ్చినట్లుగా కాక, ఆలోచించి "ఏంచేస్తాం చెప్పండి? మనంవరి బ్రతుకు లబద్ధపు బ్రతుకులేకదా" అన్నాడు. ఆ మాటల్లో తన్నేదో సూటిపోటీగా ఎత్తిపొడి

చాడని, నాగేశ్వరరావు భావం. సుబ్బారావువద్దనుండి అంత సూటైన ఘాటైన సమాధానం వస్తుందని ఆశించలేదు. తాను సూటిపోటుగా ఒక చురకవెయ్యాలని నాగేశ్వర్రావు సంభాషణను చాలింపకుండా, పొడిగించాడు.

"ఏమోనయ్యా, మీ ప్లీడర్లకు ఒక పుణ్యమనీ పురుషార్థమనీ ఉండదు. కనీసం పాప భీతి కూడా వుండదు" అన్నాడు.

సుబ్బారావుకామాటలుమరింతకష్టాన్నికలిగించినయ్. దాంతో, తన్ను తాను నిగ్రహించుకోలేక "నిజంగా మాకు పాప భీతి ఉన్నా, మీవలె పాపభీతి లేకపోయినా, ఉన్నట్లు నటించడం చాతకాదు," అనేశాడు.

గొడ్డలిపెట్టులాంటి మాటలు మీద పడేటప్పటికి, ఇక తగ్గిపోతేనే మంచిదని నాగేశ్వర్రావు తగ్గిపోయి,

"కష్టపడి చేయి. పైకి వస్తే సంతోషం" అన్నాడు.

సుబ్బారావుఆయనవద్ద శెలవుతీసుకుని, యింటికివచ్చి, జరిగిందంతా అమ్మతో చెప్పాడు. సుబ్బారావు నిజంగా బుద్ధిపూర్వకంగా అన్నమాటలు కావవి. తన్ను సమర్థించుకునే ఉద్రేకంలో అనేశాడు. అన్నతర్వాత సరైన సమాధానమే చెప్పాననికూడ సంతృప్తి చెందాడు. కాని, అతని తల్లి "ఆయనఏదో వేళాకోళాని కని ఉంటాడేమో" అంది. "అది వేళాకోళమేమిటి? తన బ్రతుకంతా అక్కడకు నిజాయితీది అయినట్టు, మేమంతా దగాకోరులమైనట్లన్న మాట?" అని తల్లిలో ఉద్రేకంతో అని "పెద్దవాళ్ళంటే వేళాకోళమూను, కుర్రవాళ్లనేటప్పటికేమో అవి తప్పులూను" అని అమ్మకు సమాధానం చెప్పేశాడు.

పై సంఘటనవలన, వారిద్దరికి మధ్య వ్యవహారాలేమీ చెడిపోలేదు. నాగేశ్వరరావు, సుబ్బారావును గురించి సుబ్బారావు తల్లివద్ద అప్పుడప్పుడు కదుపుతూ, సుబ్బారావు తమ భావాల కన్నిటికె విరుద్ధంగా మాట్లాడడంఆశ్చర్యమేననీ, పోతే తానవునన్న దాన్ని అతను కాదనడంలో మొండిధోరణితప్ప, ఔచితి లేదని అంటూ ఉండేవాడు. తల్లి

కూడ 'ఇప్పుడు కుర్రాళ్ళంతా అంతే. అంతా ఎదురుమతం' అని నాగేశ్వ
రావుతో అనేది.

ఒక రోజున నాగేశ్వరరావు ఏవో దస్తావేజులతో హఠాత్తుగా సుబ్బారావు ఆఫీసులో ప్రత్యక్షమయ్యాడు. సుబ్బారావుకు ఆయన రాక ఆశ్చర్యం కలిగించింది, ఏమిటా దైవభక్తుడిలా వచ్చాడనిఅందులోనూ, నాగేశ్వరరావు ఆ వినయ్యసంతా ఎక్కడ ఏ పాఠశాల్లో నేర్చుకున్నాడో గాని, నడిస్తే చీమ చావనట్టుగానూ, కట్టులో, బొట్టులో అత్యంత వైరాగ్యం, మాటలో ఒక ప్రత్యేకత కన్పిస్తాయి. సుబ్బారావు, అంతటివాడు తన ఆఫీసుకువస్తే, ఆహ్వానించకుండాను, మర్యాద చేయకుండాను ఉండగలడా? నాగేశ్వరరావు ఉబ్బి పోయేట్టు మర్యాద జేశాడు. "ఏమిటి దారి తప్పివచ్చారు?" అని కూడ ఆయన్ను అడిగాడు.

"నిజమే బాబూ, కోర్టు ఎక్కినవాడూ, గాడిదా సమానమన్నారు పెద్దలు. అయినా ఏంచేస్తాం చెప్పు?....మా అబ్బాయిల సంగతి తెలియని దేముంది? వాళ్ళకు షోకులు, దర్జా మినహా ఇట్లాంటివేం పట్టవుగదా నీ బోటివాడవైనా, కాస్తమందలించవాయె" అన్నాడు నాగేశ్వరరావు, చేతిలో ఉన్న దస్తావేజు సుబ్బారావుకిస్తూ. దస్తావేజు సుబ్బారావు చదువుతూండగా, మధ్యలో నాగేశ్వరరావు

"ఎంత కాచుకున్నా, చూస్తూ చూస్తూ దేనినీ అంతతేలిగ్గా వదులుకోలేము.

"ఈ రోజుల్లో పేదవాళ్లు పేదవాళ్ళలా ఉన్నారా?....నేను సంవత్సరంనుండి, పేదవాడుగదా అని కనికరించి, దావా చెయ్యకుండా ఊరుకుంటే, వాడు సంవత్సరంనుండి అదిగో ఇదిగోఅంటూ దాటేస్తూ మొన్న చివరికి ఇంతలో లాభంలేదండీ అని చెప్పేశాడు. గడువుదాటి సంవత్సరం ఊరుకున్నాదాబూ ఇంకెంతకాలం ఊరుకోను? ఇది తనఖా కాబట్టి సరి పోయింది. వాడి ఆస్థి నాకెందుకు?....మనడబ్బు అసలువస్తే వాడి ఆస్తి వాడికే యిచ్చేద్దాం, ముందునోటీసు ఇయ్యి. వాడప్పటికీ లొంగిరాకపోతే

తప్పదుగదా కోర్టుంది, ఆపైన దేవుడున్నాడు" అని గుక్క తిరగకుండా ఒక చిన్న ఉపన్యాసం దంచేశాడు.

"అలాగే" అన్నాడు సుబ్బారావు.

"ఏం చేస్తావోబాబు! మనవాడవుగదాఅనిఇస్తున్నా" అన్నాడు. నిజంగా ఎంత దయ అతనికి !

"తనఖాబాకీ, అందులోను అస్వాధీనపు తనఖా షరతులుకూడ గట్టిగానే ఉన్నాయ్ ఏం ఫర్వాలేదు" అని హామీయిచ్చాడు సుబ్బారావు. సుబ్బారావు, తనపై అభిమానముతో తనవద్దకు వచ్చినందుకు నాగేశ్వ్రరావు నభినందించాడుకూడా. నవ్వుతూ నాగేశ్వ్రరావు వెళ్ళి పోయాడు,

సుబ్బారావు నోటీసిచ్చిన నాలుగోరోజున, యింట్లో పాలుపోసే మనిషి "చూడండి బాబూ - ఈ కాగితం" అని సుబ్బారావు కిచ్చింది. అది తను ఇచ్చిన రిజిస్టరీనోటీసే. నాగేశ్వరరావుకు రావలసిన బాకీ విషయమే.

"ఇది నేనిచ్చిందే ఎన్నిసార్లడిగినా, బాకీ ఇవ్వడంలేదట, నిజంగా ఆయన మంచివాడు కాబట్టే ఇంతకాలం ఊరుకున్నాడు. కోర్టుకు వెళ్ళితే బాకీ యివ్వక తప్పదు. చెల్లయ్యను ఇచ్చివేయమనిచెప్పు" అని సలహా యిచ్చాడు. చెల్లయ్య ఆమె భర్తని సుబ్బారావుకు తెలియదు.

"ఏమోనండి దొరగారూ! ఏం మంచోడో ఏమో?....బాకీ ఏమీ తీరపనట్టుందంటగా అయ్యగోరూ" అంది.

"అవును ఆ దస్తావేజుపై మరి వసూళ్ళేమీలేవు" అన్నాడు.

"అదేంటండి. మా ఆయన ఇవ్వాల్సింది రు 400/- లేనంట. ప్రతి సంవత్సరం ఆయనకు ఎంతో కొంత మా ఆయన వసూలిచ్చినట్టు చెప్పాడండి."

"వసూలిస్తే, నాగేశ్వ్రరావుగారు వసూలు వేయలేదంటావా? ఆయనే అబద్ధం ఆడాడంటావా అయితే?"

"ఏమోనండి. నిజం దేవుడికి తెల్సు. మరి ఆయన అట్టాగే సెప్పాడు. డబ్బుయిచ్చినపుడు వసూలేయమంటే. 'వేస్తాలేరా' అనే వాడుంట. మళ్ళీ యింకోసారి అడిగితే, ఆ దొరగారికి కోపం వచ్చి, 'ఈ గొడవంతా ఎందుకు? పూర్తిగా యిచ్చేసి పట్టుకుపొమ్మ'నే వాడుంటండి. ఇంటికివచ్చి, చదువు వచ్చిన వారితో చిన్న పుస్తకంలో గుర్తుకు వేయించుకున్నాడండి. కొడుకు 5 సంవత్సరాలు పాలేరుతనం చేసినపుడు, సంవత్సరం, సంవత్సరం తీర్చినబాకీ ఎకరం పొలంలో పంటరాగానే, ఖర్చులు పోను మిగిలింది జమకట్టేవాడుండి" అని బిక్కమొగం పెట్టి చెప్పుకుంటూ, తన వద్ద చిన్న పుస్తకం సుబ్బారావు కిచ్చింది. దాని ప్రకారం నిజంగా నాగేశ్వర్రావుకు రావలసినబాకీ నాలుగు వందలే. నాగేశ్వర్రావు యింత ఘోరం తలపెట్టాడంటే సుబ్బారావు నమ్మలేక పోయాడు - నమ్మలేదు కూడా.

"దీనికి జవాబు నేనివ్వడానికి వీల్లేదు. మరో ప్లీడరుగారి దగ్గరికి వెళ్ళు" అన్నాడు.

"ఇదంతా యిచ్చుకోవలసిందేనా అయ్యగోరు?" అని అమాయకంగా, దీనంగా ప్రశ్నించింది.

"ఆ! కోర్టు కాగితాలను నమ్ముతుంది గాని, మాటలను నమ్మదుగా" అన్నాడు ప్లీడరు.

"అయితే, ఎవరిదగ్గరి కెళ్తే ఏంలాభం బాబూ" అంది.

"అది నీ యిష్టం" అన్నాడు.

"మీరు రక్షించండి. ఆయనతో చెప్పండి" అని బ్రతిమాలింది,

"సరేలే" అన్నాడు.

సుబ్బారావు నాగేశ్వర్రావుతో జరిగినదంతా చెప్పేటప్పటికే, "అయితే, నామాటే అబద్ధమంటావా?" అని సూటిగా ప్రశ్నించే టప్పటికి, సుబ్బారావు యిరకాటంలోపడి, "ఎబ్బె నేనుమాత్రం అట్లా ఎందు

కనుకుంటాను, మాకు పాలుపోసే మనిషి కదండి. నా కాళ్లా వేళ్లా పడింది. అందుకని మీతో చెప్పాను" అన్నాడు.

చెల్లయ్యకూడ, నాగేశ్వర్రావుతో జోస్తీగా ఉంటారనుకునే ఇద్దరు ముగ్గురు పెద్దలచే అడిగించాడు. వాళ్ళనుకూడ, నాగేశ్వర్రావు తరిమి కొట్టాడు. వెధవ వాడి పాపిష్టి డబ్బుకోసం తా నబద్ధమాడవలసిన ఖర్మ తనకేమీ పట్టలేదని, తనమీద ఈవిధంగా నింద్రాప్రచారం చేస్తున్నం దుకు, తగ్గించదలచుకున్నది కూడ తగ్గించనని ఖండితంగా చెప్పేశాడు.

చెల్లయ్య ఇక చెయ్యగలిగిందేమీ లేకపోయింది. చివరకు కోపం పట్టలేక "దొరగారూ, మీడబ్బు ఎగేత్తే నే పురుగులుబడి సత్తానండి లేకపోతే సెమటోడ్చి సంపాదించుకున్న నా డబ్బు తిన్నోడు, అదేగాక, ఆడి వంశం కూడ నాశనమవుద్ది" అనేసి వెళ్లిపోయాడు, ఈ మాటలు చుట్టు ప్రక్కలవాళ్లు విని, పైపెచ్చు బాకీ ఎగ్గొట్టి, ఆ విధంగా తిడు తున్నందుకు వాణ్నే నాలుగుమాటలు అన్నారు.

ఇక కోర్టు గొడవ పాపం! యిహలోకపు విషయాలు పట్టించు కొనకుండా ఉండాలని తీవ్రప్రయత్నంచేసి, తప్పనిసరై పట్టించుకొనే నాగేశ్వర్రావు. చివరకు కోర్టుకు వచ్చాడు. కోర్టుకు రావడానికి ఎంతో వైముఖ్యాన్ని ప్రదర్శించాడు!

మీరేమంటారో తెలీదు కానీ, చెల్లాయి వట్టి అమాయకుడు. అతగాడు పూర్వకాలంవాడు కూడా నేమో, ఒక పిచ్చి నమ్మకంవుంది. అన్యాయంగా ఎవరైతే మరొకరి డబ్బు తింటారో వాళ్ళు నాశనమై పోతారని. ఆ పిచ్చి నమ్మకంతోనే చచ్చేవరకూ ఉన్నాడు.

కోర్టులో, ఇహలోకపు విరాగి, ఇహలోకపు దగాకోరూ ఎదురు పడ్డారు, కోర్టువారు చెల్లయ్యను బాకీ విషయం అడిగారు. చెల్లయ్య భార్య సుబ్బారావుతో చెప్పినగోడు అంతా చెప్పుకున్నాడు. అది విని కోర్టువారు ప్లీడరును పెట్టుకోమన్నారు చెల్లయ్యను. ఇహలోకపు విరాగి, జ్ఞాని, సత్యసంధుడు, పచ్చి అబద్ధాలాడేటప్పటికి ఉద్రేకం వచ్చి,

"ఎందుకండి ఈ గొడవంతా? ఎవరు దొంగో దొరో తేలిపోద్ది. బాకీ అంతా రావాలని రామాయణం పెట్టుకుని పెమాణం చేయమనండి నా ఆస్తి అంతా యిచ్చేత్తాను" అన్నాడు మంచి ఉద్రేకంలో.

కోర్టులో ఉన్న ప్లీడర్లలో గుస గుసలు బయల్దేరినయ్. "పాపం! వాడికేమో అన్యాయం జరిగే ఉంటుంది" అన్నారు ఒకరిద్దరు. ఇహలోకపు విరాగిగారి వేషభాషలు చూచి, 'అతడేమిటి, అబద్ధమాడట మేమిటి? చెల్లయ్యదే బుకాయింపు అయి ఉంటుంది" అన్నారు ఎక్కువమంది.

చెల్లయ్య మాటల్లో తొందరితనం, ఉద్రేకం కనుపించై. విరాగిలో ఆతని మాటలకు కోపంగాని, బాధగాని ఏమీ కనుపించదాయె! రామాయణం నెత్తిమీద పెట్టుకుని ప్రమాణం చేశాడు. చెల్లయ్యకు వ్యతిరేకంగా కోర్టు తీర్పు నిచ్చింది. చెల్లయ్య నల్లబడిపోయాడు. 'ఎంత మోసం, ఎంత ఘోరం' అని గొణుక్కుంటూ, కండ్ల వెంబడి వెచ్చటి అశ్రుధారలు కార్చాడు. ఇహ లోకపు విరాగి గార్కి ఒక అబద్ధంతో చెల్లయ్య ఎకరం పొలం, ఇల్లు వచ్చాయి, అంతకంటె ఈ ప్రపంచంలో ఆతనికి కావలసిందిలేదు.

అసలే ముసలివాడేమో చెల్లయ్య! అందులోనూ, ఎంతో కష్టించి సంపాయించుకున్న డబ్బుతో కొన్న ఎకరం పొలం, ఇల్లూ పోయింది. మనోవ్యాధితో మంచం ఎక్కాడు. క్రమంగా శాశ్వతంగా ఈ లోకపు పీడవదిలించుకున్నాడు. ఆ వార్త తెలిశాక, సుబ్బారావు తల్లి, "పుణ్యాత్ము లనంటే ఊరికే పోతుందా?" అంది. ఆ మాటే దైవభక్తుడన్న లోకం బలపరిచి, యింకా రెండు నిందలు నిజం పలికి అమాయకత్వంతో అన్యాయానికి బలియైన చెల్లయ్యమీద వేసింది.

నాగేశ్వర్రావుకు పురుగులు పడిచచ్చే ఖర్మేం బట్టింది? వాళ్ళ వంశం నాశనం అయ్యే ఖర్మ ఏం వచ్చింది? ఇద్దరు కొడుకులకు ఒక్కొక్కరికి యాభై వేలరూపాయల ఆస్తి పంచాడు. కూతురుకు

నలభై వేలు కట్నం యిచ్చాడు. నాగేశ్వర్రావు నలభై వేలు ఊరుమీద వడ్డీలు తిప్పుతున్నాడు.

ఆ నాశనమైపోయే ఖర్మ చెల్లయ్య వంశానికే సంప్రాప్తించింది. చెల్లయ్య చావనే చచ్చాడుకదా దైవభక్తుని నిందించినందుకు! ఇకపోతే వంశం పొద్దస్తమానమూ కష్టపడినా కడుపు నిండని జీవితమూ, తలదాచుకునేందుకు సొంతం అనే పూరిగుడిసె లేకుండాపోయింది.

నిజంగా తెలివైన వాడు ఇహలోకంలో ఏంకావాలో తెలుసుకున్నట్టిస్నీ, దానికి ఏది ఏవిధంగా చెయ్యాలో తెలుసుకున్నది నాగేశ్వర్రావు. అతడు నిజంగా 'జ్ఞాని'. అందు కణుమాత్రంకూడా సందేహం లేదు. దానికి తోడు దావా గెల్చిన తరువాత ఆంజనేయ స్వాములవారికి వంద కొబ్బరి కాయలూ కొట్టాడు పాపపరిహారార్థం, సంపద పెరుగుదల కోసమూను.... ప్రపంచంలో అతని కంతకన్నా కావలసిందేముంది గనక.



# ఎవరు కారకులు?

బహుశా ఈ కథ చాలమంది నమ్మరేమో! ముఖ్యంగా, ఆలోచన ల్లోనూ, నాగరికతలోను ఆకాశంలో ఉన్నామని భ్రమించే వారు అపహాస్యం చేసినా చేయవచ్చు. కర్తవ్య పరాయణులకు ఓ విషాద వాస్తవ గాథ! ఎవరేమనుకుంటే ఏం! ఇది వాస్తవంగా జరిగినఘటన. ఎక్కడను కున్నారు? రామరాజ్యంలో, పదహారణాల ప్రజాస్వామ్యము వర్థిల్లుతూన్న ఆధ్యాత్మిక ధర్మ భారతావనిలో సుమా: మరచిపోకండి! ఇలాంటివి తెలియనివి ఎన్ని వున్నాయో! ఎప్పుడనుకున్నారు! అణుబాంబు యుగమైన 1957 లో సుమా!

అవును, నిజమే! ఏదో చిన్నఘటన గురించి ఎవరైనా అసలు ఎందుకాలోచించాలి! కారణాలెవరిక్కావాలి? ఎవరు కారకులో ఎందుక్కావాలి?.... నిజమే! అవసరమనుకునే వారిక్కావాలి.... కర్తవ్య రాహిత్యమైన కథంటారూ.... అయితే కావచ్చునేమో!.... అయినా వాస్తవం ప్రపంచం ముందుంచితే, ఘటనకుగల కారణములను, కారకులను తెలుసుకుని, కర్తవ్య పరాయణులవుతారనే ఆశ ఉండడములో తప్పేముంది? .... ఏమిటి వెర్రివానికితప్ప, ఎవరిక్కావాలయ్యా అంటారూ!.... పోనీలే, మీకు అతడు వెర్రివానిలా కన్పించినా కావలసినవారికి ఆప్తుడుగా కన్పిస్తాడు. అంతేచాలు. తరువాత మీరే ఆ వెర్రి వాణ్ణి ద్రోహీ అని పిలిచినా — పిలుస్తారు. పిలుస్తున్నారు. అతడు పట్టించుకోడు.

నమ్మనంటారూ, మరీ మంచిది! లోకం గ్రుడ్డిదని పాలుత్రాగుతూండండి! నమ్మననేవాణ్ణి, నమ్మించడం ఎవరిశక్యం!.... సత్యం, ధర్మం జయిస్తుందా అని ప్రశ్నిస్తున్నావా నీవు. వాస్తవాన్నినమ్మ నిరాకరించే నీవు, నిరాశావాదివైన నీవు, పరిహసించే నీవు, లేదా పట్టనట్లు ఊరుకునే నీవు, ... నిజమే! మంచిప్రశ్న. సత్యం, ధర్మం తృటిలో, అతిసులువుగా, మానవచరిత్రలో నెగ్గినదివుందా....? ఎన్ని త్యాగాలు

ఎంత బలిదానం చేయాలి? ఏం మాట్లాడవేం!.... వాస్తవం గనుక మాట్లాడవా.... అయితే ఎప్పుడని మరో ప్రశ్నా?.... అది పీడిత ప్రజా కోటి చైతన్యాన్ని ప్రశ్నించు.... అది వాస్తవమే.

## 2

పుండరీకాక్షుడు దారినిపోతూ, ఏవో పొడిమాటలు ఎవరో అనుకుంటూంటే విన్నాడు. "రాక్షసుడని" ఒకరు "రాక్షసునికంటే క్రూరుడని" మరోవ్యక్తి. పూర్తివిషయం తెలుసుకోవాలనేటంత అవుసరం పుండరీకాక్షయ్యకు మాత్రం ఏముంది? అలా చేయడం దారినిపోయే వాటిని నెత్తిన రాసుకోవడంతప్ప. అలా హాయిగా వెళ్ళిపోయాడు. పుండరీకాక్షయ్య తన గొడవ తప్పితే మరోవిషయంలో ఏమీ కలుగ చేసుకోడు. అతడు యువకుడు. ప్లీడరీ చేస్తున్నాడు.

జూనియర్ ప్లీడరవటంవలన అతనికి క్లయింట్లతో అంత భాధ లేదు. ఏదో తన తండ్రి యిచ్చిన పక్కాటి డాబా, ఇరువది ఎకరాల పొలంతో నిర్విచారంగా కాలం వెళ్ళబుచ్చుతున్నాడు. అందుచేత ప్రాక్టీసు ఉందా, లేదా అనేబాధ అంతగా పట్టించుకోడు. నిజానికి పట్టించుకున్నా బాధపడడం తప్ప అదనంగా జూనియర్‌కు ప్రాక్టీసు వచ్చేదిశూన్యమే. హాయిగా డిటెక్టివ నవలలు చదువుకుంటూ, క్లబ్బులో సరదాగా కాలం వెళ్ళబుచ్చేరకం అతడు. అయినా కోర్టుకుమాత్రం రోజూ వెళ్తూనే ఉంటాడు. చెట్టుక్రింద ప్లీడరన్నా, ఇంట్లో ఆవిడ గేలిచేసినా పట్టించు కోడుకూడా.

సరే ఒకరోజున పుండరీకాక్షునకు ఒక బ్రీఫ్ తగిలింది (సెషన్సు కేసుల్లో ముద్దాయి ప్లీడరునుపెట్టుకోలేకపోతే ప్రభుత్వమే ప్లీడరును నియమిస్తుంది.) అతనికి పట్టరాని సంతోషం కలిగించింది. పట్టుదలగా కేసు చేయాలనుకున్నాడు. ముద్దాయిని విడిపించాలనుకున్నాడు. రికార్డు తీసుకున్నాడు. ఇంటికి వెళ్ళాడు రికార్డు క్షుణ్ణంగా చదివాడు. ఇక డిఫెన్సు

ఆలోచించడం మొదలుపెట్టాడు. వెంటనే అంతుదొరకలేదు. సరే తలలు నెరసినవారుకూడా పెదవి విరిచారు.... నిజమే మరి "డబుల్ మర్డరు". నిరాశతో ఇంటికి వచ్చాడు. ఏమీతోచక, గంభీరంగా గదిలో అటూ, ఇటూ తిరుగుతూ, సిగరెట్టుమీద సిగరెట్టు పీలుస్తూ ఆలోచించాడు. పదే పదే కేసువిషయాలను మననం చేసుకున్నాడు. తల పట్టుకుని దీర్ఘంగా ఆలోచించగా, ఆలోచించగా, గాఢాంధకారంలో మెరుపులా ఆకస్మికంగా ఒక ఆలోచన తట్టింది.... ఎగిరి గంతేశాడు; కేసు నెగ్గాం అంటే నెగ్గాం అనుకున్నాడు. కాని అది మెరుపులానే అదృశ్యమైంది. మళ్ళీ గాఢాంధకారం. ఎంత తన్నుకున్నా బలీయమైన 'డిఫెన్సు' దొరకడంలేదు. ముద్దాయి దురదృష్టవంతు డనుకున్నాడు. అయినా ఆలోచన మాత్రం మానలేదు. ఎందుచేతనంటే ఆశ అనేది మానవ జీవితానికి ఆధారంకదా: తాను చేయవలసిన ప్రయత్నమంతా చేద్దామనుకొన్నాడు. ఆపైన వాడి అదృష్టం అనుకున్నాడు.

సరే వెళ్ళి ముద్దాయిని జైల్లో చూచాడు. చూడగానే నివ్వెరపోయాడు; ఏది తన తండ్రి పొగడిన లక్ష్మయ్యా? ఎంతటి చిత్రం! నిజంగా అతడీ ఘోరదుశ్చంతాన్ని చేసి ఉంటాడంటే నమ్మలేడు. "నీవా! లక్ష్మయ్యా?" అని పలుకరించాడు ప్లీడరు పుండరీకాక్షయ్యగారు. తరువాత అడుగుదామనుకున్న ప్రశ్నలు నోటరాలేదు. తనతండ్రి లక్ష్మయ్యను బాగా ఎరుగును. తన తండ్రికి పంచలు నేసియిచ్చేవాడు. లక్ష్మయ్య నిజాయితీ పరుడని, మంచివాడని, ఇలాంటి నమ్మకస్థుడు, మర్యాదస్థుడు దొరకడనేవాడు. ఈనాడు ఆ మంచిలక్షణాలు ఏమైనయ్?.... అయితే అతడే ఈనేరం చేశాడన్నారు. కాదంటే?.... నిర్ణయించాలి.... ప్రస్తుతానికి అది లక్ష్మయ్యకు ఏవిధంగానూ ఉపయోగపడదుకదా!

నేరానికి కారకులెవరైతేనేం! లక్ష్మయ్య జైల్లో నేరస్థుడుగా బంధింపబడ్డాడు. రేపు కోర్టులో న్యాయమూర్తి ముందు ముద్దాయిగా బోనులోనిల్చుంచే అక్కడ గూడిన జనసమూహం అతగాడిని ఎంత అసహ్యించుకుంటారు! చీదరించు కుంటారు! నిన్నటివరకూ పెద్దమనిషి

అయిన లక్ష్మయ్య నేడు హంతకుడు; లోకంలో అడుగు పెట్టడానికే అతని కమిత బాధాకరం, తలవంపులూ అని భావిస్తూ, జరిగిన విషాద గాధకు వ్యధిత హృదయముతో కుమిలిపోతూన్న లక్ష్మయ్యకు ఉరి కంబమే శరణ్యమనిపించింది. రెండవసారి అయినా అతనికి యీ పంకిల ప్రపంచంనుండి ముక్తి కల్గుతుందా? కలుగుతుందనే ఆశిస్తున్నాడు. ఆత్మ విశ్వాసం కోల్పోయి, సర్వస్వమునూ చేతులతో ఆవేశములో, కోల్పోయిన వ్యక్తి సజీవుడుగా ఉంటే ఎంత బాధపడతాడో వేరే చెప్పాలా? అలాంటివాడికి ఆశ అనేది కోరినా రాదు. మానవునిలో ప్రాణంపై ఉండే అనంత మమకారముపై అతనిలో, నిరాశా ప్రళయ కారు మేఘాలు దట్టంగా క్రమ్మివేసినయ్. అతనిలో లోగడ ఎవరి కోసమో జీవించాలనే బలీయమైన కోర్కె, కారు చీకటియందు వణికి పోయి అతణ్ణి వెర్రివానిగాచేసింది. ఈనాడు ఏ ఆశా అవసరంలేని వ్యధిత హృదయునికి — తాను ప్రాణంగా చూసుకునే వారే, తాను తలపెట్టిన కార్యంతో కనుపించకుండా పోగొట్టుకున్న - ప్రాణంమీద తీపి ఏవిధంగా ఉంటుంది.... ఇతరుల హృదయాలను చీల్చివేసే కరుణామయ గాధకు కారకులెవరూ అనే విషయం ప్రపంచానికి తప్ప, అతని కెందుకు? ....హృదయం బండబారిపోయింది.... కన్నీరుకార్చి కార్చి కండ్లు అలసట జెందినయ్.... అతడు పేరుకు సజీవి; పేరుకు నిర్జీవి ...ఆ జైల్లో ఎంత హాయిగా ఉంది ఆ రాతిగుండెకు.... అతని చుట్టూ ఉన్నది నేరస్థులే.... చిత్రం ఏమంటే వారతనికి ధైర్యంచెప్పి, సలహాలిచ్చి, అతని ప్రాణాలను రక్షించాలని చూస్తారేమిటి?.... హంతకుని ప్రాణములు రక్షించాలని చూడడమా? ఏమిటి, వారిలోకూడ ప్రేమ అనేది ఉందా? ఏది! ఆ దొంగలకు.... ఆలుచ్చాలకు.... అతనికి వారికి ఏమిటి చుట్టరికం?.... గతంలో ఎవరు ఎవరో ఎవరికీ తెలీదే! నాలుగు గోడలమధ్య, ఆ నరకకూపం తెచ్చిపెట్టిన బంధుత్వమా?' లేక వారి హృదయాలలోనే ఉన్న ఏదో అనిర్వచనీయ అంతర్గత కారణం ఏదైనా, ఇతనియెడ వారు చూపే అవ్యాజమైన ప్రేమకు? మానవ జీవితాలు ఎంత లోతైనవి;

వారుచూపే అవ్యాజప్రేమ, జైలు బయట అతనికి కన్పించదే!.... వారిదివరకే నేర్పారు పాఠాలు....కాని అవన్నీ చెవిటివాని చెవిలో శంఖం వూదినట్లే.—

కాని ప్లీడరు పుండరీకాక్షయ్య అడిగిన ప్రశ్న, విద్యుత్ప్రవాహంలా అతనిలో పనిచేసి, ఈ ప్రపంచాన్ని అతని స్మరణకు తీసుకుపోయింది. మళ్ళీ ఒక్కసారిగా ఆ దారుణ సంఘటన - తలవంపులు, లోకంయొక్క భయంకరరూపం, అతని యెదుట సాక్షాత్కరించి అతణ్ణి కంపించి వేసింది. ఒక్కసారి బావురుమని ఏడ్చాడు. ఆతడి కండ్లలో క్రూరత్వం. నిర్దాక్షిణ్యం, అమానుషత్వం కన్పించేబదులు, విచారం. విషాదం, జాలి, నిస్సహాయత తప్ప ఏమీ కనుపించవే! చిత్రం........"నా ముఖం చూడ కండి బాబు .... మీకు మహాపాపం చుట్టుకుంటుంది .... నేను మహా పాపిని, కాదు, రాక్షసుణ్ణి, కాదు రాక్షసునికన్న నీచుణ్ణి....నన్నుముక్క ముక్కలుగా కోసినా పాపంలేదు...."అంటూ తనముఖాన్ని చేతుల్తో కప్పు కుని, కూలబడ్డాడు.

"ఫరవాలేదు ధైర్యంగా ఉండు. నేను నీ ప్లీడరును. రేపే నీ వాయిదా. అసలు జరిగినదేమిటో చెప్పు" అని ప్రశ్నించాడు.

"ఆ చివర ప్రశ్న అడిగేకన్న చంపడం మేలు....నన్ను ఉరితీసె య్యండి....నాకు—నాకు బ్రతికేందుకు యోగ్యతలేదు" అన్నాడు ముఖం కప్పుకునే.

అతనిని, అతని బాధను చూస్తూ ప్లీడరుగారుకూడ కంటతడి పెట్టకుండా వుండలేక పోయాడు. ఇలాంటిస్థితిలో అతణ్ణి ప్రశ్నించి కూడ ప్రయోజనం లేదనుకున్నాడు. వెళ్ళి పోయేందుకు నాలుగు అడుగులు వేశాడు. ఇంతలో గజదొంగ ఒకడు పిలిచి ఒక సలహా చెప్పాడు. వాడు బహూశా లక్ష్మయ్య మనస్తత్వాన్ని అర్థం చేసుకున్నట్లున్నాడు. "ఆడికి ఎంత, సెప్పినా లాభం లేదుబాబూ....మీరు ఆడితో రేపు వాదాలంటే నేను చెప్పినట్లు చెప్పమనండి....అంతా రైటయిపోద్ది" అన్నాడు. ఎంత తెలివి ఉంది వాడికి! గజదొంగ అలా ఎందుకు

నిష్ప్రయోజనం చేస్తాడా తెలివిని?.........ప్లీడరుగారు నెమ్మదిగా వెళ్లిపోయాడు.

# 3

లక్ష్మయ్యను కోర్టుకు తీసుకు వచ్చారు. ముఖమెత్తి నలుగురినీ చూడలేకపోయాడు. ఈ కేసు వినాలని కుతూహలంతో చాలమంది వచ్చారు. కొంతమందికి ఈగాథ విషాదంగాను, కొంతమందికి పైశాచికంగానూ కన్పించింది.

ఎసెసర్లు కూర్చున్నారు. న్యాయమూర్తి లక్ష్మయ్యమీద మోపిన రెండు ఛార్జీలను చదివి వినిపించి, నేరము చేశావా అని అడిగితే "లేదు బాబు" అని మాత్రమే అనగలిగాడు. కండ్ల వెంబడి ధారావాహినిగా కన్నీరు కారుతోంది. ప్లీడరు గజదొంగ సలహాను పాటించాడు. ఆ సలహా బ్రహ్మాస్త్రంగా పనిచేసింది. అతని ఆతృత తీరిపోయింది.

ప్రాసిక్యూషన్ సాక్ష్యం పూర్తి అయింది. ముద్దాయి స్టేట్‌మెంటు అయిపోయింది. ప్రాసిక్యూటర్ రెండు ఛార్జీల క్రింద, ముద్దాయి ఏవిధంగా నిందితుడో చెప్పి. ఒక మహానేరస్థుని భూమిపై లేకుండాచేసి, సంఘసేవ చేశాననే సంతృప్తితో కాబోలు కూర్చున్నాడు. విజయ గర్వంతో అందరిని కలయజూశాడు, క్రిక్కిరిసిన జనసమూహం, ముద్దాయి తరఫున ప్లీడరుగారి వాదనకై ఎదురుచూస్తున్నారు.

లక్ష్మయ్యప్లీడరు, అనుభవం తక్కువ వాడైనా తెలివిగలవాడు. ముందు, ఈ విషాదగాథను, న్యాయమూర్తి హృదయం ద్రవించేలాచెప్పి విజయం పొందాలని చూశాడు....కాని న్యాయానికి, చట్టానికి దయాదాక్షిణ్యాలుండవని గుర్తుకు తెచ్చుకుని ప్రారంభించాడు వాదనను,

"మీముందు ముద్దాయి ఏవిధంగా నిర్దోషో ఋజువుచేస్తా, మిమ్మల్ని ఒకే విషయంపై తీవ్రంగా పదేపదే ఆలోచించి, నిర్ణయానికి రావలసినదిగా కోరుతున్నాను. ప్రాసిక్యూటరు చెప్పినట్లు, లక్ష్మయ్య

పనీ పాట చెయ్యక, పీడగా ఉన్న పిల్లలభారాన్ని పోగొట్టుకునేందుకు, ఈ ఘోరకృత్యానికి ఒడిగట్టాడనే సంగతి నిజంగాదు. ఎందుచేతనంటే అతడు సోమరిపోతుకాదు. సోమరిపోతు లెందరులేరు దేశములో! వారందరూ ఈ పకంగా చేస్తున్నారా?....అందులోనూ, తన రక్తాన్ని పంచుకు పుట్టిన పిల్లలను, తాను కన్నపిల్లలను, ముద్దాయి తన చేతు లారా తండ్రి అయిన ఈ ముద్దాయి చంపి ఉంటాడని నమ్మటమంటే ఇంతకంటె దారుణములేదు. కష్టించి పనిచేసుకునే లక్ష్మయ్యలాంటివారు పిల్లలను, తమ ప్రాణాలకంటె మిన్నగా చూసుకుంటారు.

"అనుభవంలోచూస్తే, ఇంకా ఉన్నవారే సంతాన నిరోధము అమలులో పెడుతున్నారు సంతానానికి ఆస్తులు తగ్గుతవని.....అంతేకాదు. లక్ష్మయ్య కష్టించి పనిచేసేవాడని, మగ్గంవదలి నిముషం వృథాపుచ్చే వాడు కాదని. భార్యపోయిన తరువాత, పిల్లలను మరింత శ్రద్ధతో, ప్రేమతో ఆ లేత హృదయాలకు ఎక్కడా నొప్పితగులకుండా, అతి గారాబంగా పెంచాడని ప్రాసిక్యూషను సాక్షులే అంగీకరించారు. అలాంటి తండ్రిఅయిన ఈ ముద్దాయి తన పిల్లలను హత్యచేశాడంటే నమ్మ గలమా?........చూశాననిచెప్పే పెద్దమనిషి లక్ష్మయ్యకు తనకూ విరోధమని తానే అంగీకరించాడుకదా! ఆ పెద్దమనిషి నేరప్రదేశానికి ఎందుకు వెళ్ళవలసి వచ్చిందో చెప్పకపోయాడు....తాను చూశాననే విషయాన్ని వెంటనే ఇతరులలో ఏవరితోనూ చెప్పలేదు....అలాంటి అబద్ధపు సాక్షి వాఙ్మూలంమీద ఆధారపడి ఈ ముద్దాయి నేరస్థుడని చెప్పడం చాల అన్యాయం."

ఈ మాటలు లక్ష్మయ్య ఏమీ పట్టించుకోలేదు.........ప్లీడరుగారు తన వాదాన్ని సాగించాడు.

"ముద్దాయి దోషి అని ప్రాసిక్యూషన్‌వారు నిస్సందేహంగా ఋజువుచేయాలి. అలా చేయలేక పోయారు వారు. నా వాదన సహేతుక మైనదని, బలమైనదని మనవిచేస్తున్నా....అవును లక్ష్మయ్యనిరుద్యోగే.... కాళ్ళుఅరిగేట్టు తిరిగినా ఉద్యోగం లభించకపోతే నిరుద్యోగికాక ఏమవు

లాడు. ఇంకానయం అతడు దొంగతనానికి పూనుకోలేదు. అందుకు మనం అతణ్ణి అభినందించాలి. అతనికి ఉద్యోగం ఇప్పించాలనే బాధే గాని, బాధ్యతగాని ఎవరు తీసుకున్నారు?...."అవును చేనేత పరిశ్రమ బాగా దెబ్బతిన్నది....చేనేతవారిలో నిరుద్యోగం ప్రబలిపోయింది.... పిల్లలు తిండిలేక మలమల మాడినమాట వాస్తవమే....అంతమాత్రాన పిల్లలను ముద్దాయి చంపాడని ఎక్కడుంది....? ఆకలికి తట్టుకోలేక ఆ పిల్లలే నూతిలో పడగూడదని ఎక్కడుంధి? అందులో లక్ష్మయ్య ఇల్లుకూడ బావిదగ్గరనే....వారి కేకలువిని, పిల్లలను రక్షించుకోడానికి నూతిలో లక్ష్మయ్య ఎందుకు దూకడు?....అది ఆత్మహత్య ఎలా అవుతుంది? అందుచేత ముద్దాయి నిర్దోషి" అని గంభీరంగా ముగించాడు. ఎసెసర్లు ముద్దాయి దోషి అన్నారు. తీర్పుకై న్యాయమూర్తి వాయిదా వేశారు.

# 4

లక్ష్మయ్య పూర్వకాలపు మనిషి. ఎంత అమాయకుడో అంత పెద్దమనిషి. సున్నిత హృదయం, ఆత్మాభిమానం గలవాడు. భారంగా. పేదరికంతో జీవితం గడిపేవాడు, అయినా, ఒక్కనాడు ఎవరితోనూ మాటపడ్డ మనిషికాదు. బంగారుబిడ్డలను కన్నందుకు చివరకు కడుపు నిండా తిండి, వంటినిండాగుడ్డ- చదువుమాట దేవుడెరుగు- ఇవ్వలేక పోయాడు. అందుకు లోలోపల కుమిలిపోతూ మనిషి ఎంతో క్షీణించి పోయాడు.

ఇలా బాధపడుతూ రోడ్డు వెంబడి వస్తూంటే పెద్ద భవనాలు అపహాస్యం చేసేవి. పూరిగుడిసె లతణ్ణి ఆహ్వానించి స్థయిర్యం, విశ్రాంతి ఇచ్చేందుకు ప్రయత్నించినయ్. పేదరికం, మన సమాజములో నిరాటంకంగా సాగిపోతున్న దోపిడీయే కారణమనిగాని, మన సమాజంలో అంతర్గతంగా ఉండే సహజ వైరుధ్యాల ఘర్షణను అర్థంచేసుకుని, మానవుడు మార్పుకై ప్రయత్నిస్తే, కష్టజీవుల రాజ్యం ఏర్పడు.

తుందనే సూత్రంఇంకా అతనికితెలీదు. అతనికేకాదు, మహా మహా మేధావులకే ఆలోతు తెలీదు. ఒకవేళ తెలిసినా మార్పును వ్యతిరేకించేవారు తయారవుతున్నారు.... గంజికేంద్రాలవల్ల సమస్యలు పరిష్కారమయితే, ప్రపంచంలో ప్రతి సమస్య అతి సులువుగా పరిష్కరింపబడేది.... ఉన్న వైరుధ్యాలను కప్పేందుకు పైపూతలు ఎన్ని పూసినా, ఎంతకాలం సాగుతుంది మోసపుబండి!

మోసినంతకాలం, మోశాడు గాడిదబరువులా సంసారాన్ని.... ఇక మోయలేక పోయాడు. అసహనం పెరిగింది; పిల్లలపై చెయి చేసుకుని, తరువాత వారిని కౌగలించుకుని కంటనీరు పెట్టేవాడు. అయితే ఏంలాభం? కష్టాలతని విశ్వాసాన్ని జయించినయ్.... ఆ బంగారు బిడ్డలు నేడులేరు.... ఇపుడు వగచి ఏం లాభం?.... చేతులారా ఆవేశంతో చేసినపని.... కర్కశత్వమువల్ల కాదు గదూ!....

మానవ జీవితం తమాషా. ఈ విషాద నాటకానికి ప్రేక్షకులతో హాలంతా నిండి పోయింది. బహుశా న్యాయమూర్తి ఉరిశిక్ష వేయవచ్చు అనుకుంటున్నారు. లక్ష్మయ్య, ఈవల్ల కాటి ప్రపంచంనుండి విడగడయ్యే రోజు వచ్చింది గదా అని సంతోషిస్తున్నాడు. పుండరీకాక్షయ్యగారు ఆతృతతో ఆవేదనతో తీర్పుకై నిరీక్షిస్తున్నాడు.

న్యాయమూర్తి తీర్పు చదువు తున్నాడు. ప్లీడరుగారి పెదవులపై చిరునవ్వు నాట్యం చేస్తోంది....చదివి చదివి ముద్దాయి నిర్దోషి అన్నారు న్యాయమూర్తి. అంతేకాదు; ఈ విషాద సంఘటన పేదరికం వలన సంభవించిం దన్నారు.

ప్లీడరుగారి సంతోషానికి పట్టపగ్గాలులేవు. చాల బాగా చేశాడంటే చాలబాగా చేశాడన్నారు ప్రేక్షకులు.

పాపం శమించుగాక: పేదరికంవల్ల ఒకటి కాదు, "రెండు ఒకే నిమిషాన సంభవించినవా! తిండిలేక ఈ విశాల విశ్వంలో తిండిలేక చచ్చినవాడెవ్వడని" అని ఒక పెద్ద కవినని చెప్పుకునే ఆయన అంటే నిజమేమో అనిపించింది .... కాని ఘోరమేమిటి .... తెలీనివి ఎన్ని

ఉన్నాయో!....న్యాయానికి దయ అన్నది లేదు - పిల్లలను పోగొట్టు కున్నాడు. హంతకునివలె కోర్టులో విచారింపబడ్డాడు. అదొక చిత్రం.

న్యాయమూర్తికి అర్థంకాలా పేదరికానికి కారణం ఏమిటో. కారకు లెవరో అనే ప్రశ్న లేనేలేదు.

కాని కవిగారికి, న్యాయమూర్తికి తెలియని విషయం తమ ఆస్థులకు, మానవుని సర్వదా అజ్ఞానములో పెట్టి, తమ వ్యక్తుల రక్షణకు తాము చట్టమును రచించుకొని, కష్టించేవానికీ, కష్టించ సిద్ధంగా ఉండి నిరుద్యోగంతో బాధపడే నిరాయుధులకు దురుద్దేశ్య పూర్వకంగా రక్షణ కల్పించని, తమ చట్టమును రచించుకున్న ఆ భోగలాలసులకు తెలుసు. అంతేగాదు. దోపిడీని రూపుమాపి, మహోన్నతమైన నూతన మానవ సమాజ నిర్మాణ కర్తవ్యపరాయణులకు కొన్ని భయంకరనామములను —హంతకులు, రక్తపిపాసకులు; అనాగరికులు, హింసావాదులు, నియంతలు, ఒకటేమిటి ఎన్నెన్నో తగిలించి, ప్రజాస్వామికం ముసుగులో వారిపై చట్టమన్న పేరుతో పగసాధించుకుంటూ, ప్రజలను వంచించ గల, వంచిస్తూన్న అ పెద్దల నైపుణ్యానికివే మరోసారి జోహార్లు:

లక్ష్మయ్య నిరాశ చెందాడు....ప్లీడరుగారు సంతోషంతో అతని భుజంతడితే, "నాకు మహోపకారం చేశారండీ" అన్నాడతను. ప్లీడరు నిరుత్తరుడై పోయాడు. అతడిలా ఎందుకన్నాడో ఇప్పటికీ అతనికి తెలీదు.

"ఎక్కడికి పోవాలి? ఏంచేయాలి?" ఈ ప్రశ్నలు మళ్ళీ అతణ్ణి కలవర పెట్టినయ్. "నిరాశ పడకు .... ప్రపంచంలోకి వెళ్లు .... ఇకనైనా తెలుసుకో....నీ దుర్భర దారిద్ర్యానికి కారణం. ఎవరి వలన నీ బిడ్డలను నీ చేతినుండి జారవిడుచు కున్నావో ఆలోచించు .... మరో ప్రపంచాన్ని—నిర్మించుకో! వెళ్ళు!" అని ఏదోవాణి అతణ్ణి ఆ కోర్టునుండి కదలించింది. మళ్ళీ మృత్యువును కౌగిలించుకున్నా, దూరంగా తరిమి కొట్టబడుతున్న లక్ష్మయ్య ఈ పెద్దల శ్రేయోరాజ్యంలో కాలు పెట్టాడు: ఏంచేస్తాడో........అతడిష్టం.

# తారక మంత్రం!

"ఎవరు నువ్వు ?"

"కనుపించడంలా? ఒక మనిషిని."

"ఎందుకు వచ్చావ్ ?"

"ఒక సంగతి అడగడానికి"

"ఏమిట్రా పెద్ద ఆఫీసర్‌లా డబాయిస్తావ్—ఎవరవో చెప్పు"

"ఇందాకనే చెప్పానుగా మనిషినని."

"కాదు. ఈమ్మాటికి నువ్వు మనిషివికాదు. నువ్వువచ్చిదొంగవి."

"దొంగనుకాదు. దొరను తెలిసిందా" అని భుజంతట్టి చెప్పాడు.

"దొర అనే పదం పరువుకూడా తీస్తావెందుకురా! దొంగవు కాక పోతే అర్ధరాత్రి ఎందుకొచ్చావ్ ?"

"ఆ పదం పేరుతీసేదిమీరు. నేను కష్టించి కడుపునింపుకునే నిజాయితీ పరుణ్ణి"

"ఏమంటున్నావురా, బద్మాష్?" అని ఉరిమాడు.

"ఉన్న మాటన్నాను - అన్యాయంగా, అక్రమంగా లాభాలార్జించ డమేకాక లాభంలో కట్టవలసినపన్ను ఎగవేసేవాడవు నువ్వుదొంగవు కావూ :—చెప్పు ?

"అది మా యిష్టం - అధికారంమాది. మామాట ప్రజలమాట. అడగడానికి నువ్వెవడవ్ ?"

"ఏం ! నేనూ ప్రజనే - నామీద పెత్తనమయితే చెలాయిస్తావు గాని, నేనడగడానికి హక్కులేదేం? నేను, మీ అందరి సుఖంకోసం సంఘం ఎడల బాధ్యతగా ప్రవర్తించాలిగాని నేనెలా బ్రతుకాలో, నేనెలా బ్రతుకుతున్నానో అన్న విషయం మీదూ, సంఘం పట్టించుకోరే ?

ప్రశ్నలు ఘాటుగానే ఉన్నయ్. ప్రశ్నల్లో నిజం లేకపోలేదని ఆతని బుద్ధి కెందుకో తోచింది. వీడెవడో విషయాలు తెలిసినవాడయి యుంటాడు. అందుకు సందేహంలేదు. లేకపోతే ఇన్ని ప్రశ్నలురావు.

"అందరికీ సమానావకాశాలు ఫో! చదువుకో. తెలివి సంపా యించుకో. ఆపైన ఉద్యోగం సంపాదించుకో." అన్నాడతడు.

"తిండికొకటి తిఖానాలేదుగాని, చదువుకోవాలట! చదువుకోవడం! నీకేం కడుపునిండినవాడవు. ఎన్ని కబుర్లయినా చెప్పుతావ్.

"పుట్టినవాళ్ళా, పుట్టేవాళ్ళా, మేం పుట్టమంటే పుడుతున్నారా వీళ్ళందరికీ సమాధానం చెప్పడానికి ? ఫో ! కష్టపడు ! చదువుకో. పెద్ద వాడివికా. ఎవడొద్దన్నాడు, అందరికీ సమానావకాశాలు."

"మళ్ళీ అదేమాట ? కష్టపడటానికి సిద్ధమే. పని లేకనే యేడ్చేది ఆ పని గ్యారంటీ యెందుకివ్వలేరూ అనే అడిగేది. నీకు మాత్రం, ఆస్థి రక్షణ, ప్రాణరక్షణ, మానరక్షణ. ఆ రక్షణ, యీ రక్షణ ఎన్నున్నా చాలవుగాని మాకు కనీస ప్రాధమిక హక్కు ఎందుకివ్వవ్ ? బాధ్యతలు తట్టెడు నెత్తిమీద పెడతారేం ?....మాట్లాడవేం ?"

ఏం మాట్లాడతాడతడు మాత్రం ?....మిగతావి కాగితంమీద నైనా వున్నాయ్. అతడడిగింది కనుపించదు....శ్రద్ధగా వెతికాడు.... పేజీలన్నీ తిరగేశాడు... ఆ సంగతి దొరకలేదు. సంభాషణ మార్చాలని ప్రయత్నించి "ఇంతకూ, ఎందుకు వచ్చావో చెప్పావుకాదు." అని బుజ్జగిస్తూ అడిగాడు.

"చెప్పానుగా....ఏమైనా చెవుడా ?" అని గద్దించి రెండోవ్యక్తి అడిగాడు,

ఇంతలో 'దారిద్ర్యంపై యుద్ధం' అన్న మాటలు అతని చెవుల్లో గింగురుమన్నయ్.

అతనికి మెళుకువవచ్చింది. అతడే గోవిందయ్య - షాహుకారు. కలవరంతోలేచి, స్విచ్ వేశాడు. గదిలో విద్యుద్దీపం దేదీప్యమానంగా

వెలిగింది. గది అంతా కలయజూశాడు, కళ్లు ఒకసారి నులుముకొని, విప్పారి చూచాడు. .... ఏమీ కన్పించదే ?.... రెండోవ్యక్తి పారి పోయాడా ?....అదేమీలేదు....ఇనప్పెట్టె వద్దకువెళ్ళి చూశాడు. పెట్టె లోపలనుండి "నేను భద్రంగా ఉన్నాను"అని "లక్ష్మి" చెప్పింది. ఒక వేళ ఎవరైనా ఆఫీసరేమోనని భయపడి, ఎకౌంటు పుస్తకాల వద్దకు వెళ్ళి చూచుకున్నాడు. అవి భద్రంగానే ఉన్నాయ్....మనస్సు శాంతిం చింది. ఇంతకూ, నిద్రలో గందరగోళానికి 'దారిద్ర్యంతో యుద్ధం' — అన్న మాటలు కారణం - 'గాభరాపడకు, కలవారి మాటలు కనకాన్ని సృష్టించేట్టుండాలిగా, అప్పుడుగాని కుక్క గొడుగుల్లా పుట్టుకవచ్చిన అలగా జనం మనపై ఆశలు పెట్టుకోదు.' అని ఏదోవాణి అతనికి చెప్పి నట్లుగా భావించి, 'చాలా బాగుంది. ప్రపంచంఅంతా సవ్యంగానే ఉంది' అనుకుని గుండెమీద చేయివేసుకొని పడుకున్నాడు.

గోవిందయ్య జట్కాలో బయలుదేరాడు ఏదో పనిమీద. అడపా, దడపా ఎవరైనా జట్కా ఎక్కితే, ఆజట్కావాడు వారి నభినందించడం పరిపాటి. ఆ అభినందనలే నేడు గోవిందయ్యకు దక్కాయి.

"ఏదో మీబోటివా రుండటంవల్ల మే మిట్టా బతకగల్గుతున్నాం బాబుగారూ" అన్నాడు బండివాడు,

ఆ మాటకు గోవిందయ్య ఉబ్బి తబ్బిబ్బయి పోయాడు, బండి వాడి మాటలను కాదనేవారు తక్షణం అతనికి దొరకలేదుకాని, లేకపోతే సాక్ష్యంతోసహా వాళ్ళను వోడించేవాడే - ఏం లాభం ? దైవం అను కూలించి ఉండదు.

"ఏరా, యివ్వాళ రిక్షావాళ్ళు ఎవరూ కనబడరే ?" అని ప్రశ్నిం చాడు గోవిందయ్య.

"ఏం చెప్పమంటారు బాబూ :- ఆ రిక్సాలోళ్ళొచ్చి మా నోటికాడ ఘూడు పోగొట్టారుకదా:

"అవునురా పాపం" అని గోవిందయ్య తన హృదయంలో జాలినంతా ఒలకబోశాడు.

"ఈరిక్శాలొచ్చిన తరవాతండి, సాలమంది గుర్రబ్బల్లు వదిలే శారండీ, నేనుమాత్రం మానసానికి పడి, బాడుగ దొరక్కపోయినా ఇట్టా ఎల్లమారుసుకుంటున్నా" అని, దేవుడు లేడంటండీ?" అనితన విశ్వాస మునుకూడ బండివాడు తెలిపాడు,

"దేవుడు లేకపోవడ మేమిట్రా - ఉండబట్టే. కాలం తిన్నగా నడుస్తోంది" అన్నాడు గోవిందయ్య.

"అందుకే బాబు, రిక్షాలోళ్ళ రోగం కుదిరిశాడు. మానోటికాడ కూడు ఆడుపోగొడితే, ఆడినోటికాడ కూడు దేవుడు పోగొట్టాడు."

"ఏం జరిగిందేం?"

"ఏం జరగడ మేంటండి! - ఆల్లరోగం టక్కునకుదిరింది. రిక్షాలో ఒక పిల్లకంటె ఎక్కువ ఎక్కించుకో గూడదన్నారు....దాంతో మాకు కొత్త తిండి దొరుకుద్ది."

"అట్టాగా - అందరు సమానులే గదట్రా మరి,"

"అవును బాబూ — అయినా సూడండి, ఆల్లూరుకుంటున్నారా? అట్టా అనడం అన్యాయం — నోటికాడ కూడుపోద్ది అని, ఇవాల అందరూ సమ్మెచేసి, చెప్పుకుంటానికి పోయారండి."

"అదా అసలుసంగతి" అని తల పంకించాడు గోవిందయ్య.

"అయ్యగోటూ, ఆల్లతోమాకు పెద్ద సెడ్డసిక్కొచ్చిందండి - మాకూ ఆల్లకూ ఒకతూరి అయ్యేదేనండి గొడవ....అవునుగాని బాబూ ఈ సంగతి నిజమో కాదో చెప్పండి. ఈ రిక్శా లసలు తీసేత్తారంటగా! తీసేత్తే మా శని యిరగడైపోద్ది. అన్నాడు బండివాడు,

"అవునట - పూర్వంలా, ఈ రోజుల్లోకూడ, మనిషిని మనిషి

మోయడ మేమిట్రా....? అది 'మనిషి' అన్న పదానికే అవమానం" అన్నాడు గోవిందయ్య.

"అవునండీ అదీ నిజమే"

తీవ్రంగా ఆలోచిస్తే జీవితాన్ని అర్థంచేసుకోవడం బహు దుస్తరం. పరిశీలించిచూస్తే భయంకరంగానూ, అయోమయంగాను కన్పిస్తుంది. ఈ భీకర వలయంనుండి బయటపడే దారనే దసలుందా అన్న ప్రశ్నకు సమాధానం దొరకనట్లు కన్పిస్తుంది. మార్గంలేకేం? ఆ మార్గాలే దొరక్కపోతే, యీ సరికి మానవజాతి నశించిపోయేదేమో కూడా....ఒకటిమాత్రం నిజం అనిపిస్తుంది. మనం ఎంత ముందడుగు వేస్తున్నామో యీ సమాజంలో అన్ని చిక్కులు. సమాజ పరిధి, జీవిత పరిధి పెరుగుతూనేవుంది, 'రేపు' మీద నైనా మానవుడు విశ్వాసం కోల్పోలేదు.

ఆది మానవునకు ప్రకృతితో పోరాడడం ఒక్క సమస్య-కాని నేటి మానవునకు ప్రకృతితో పోరాడుతూనే, సమాజంతో కూడ పోరాడవలసి వచ్చింది. మన సమాజంలో ప్రతి అడుగునా, మనకు కన్పించేది ప్రతి అడుగునా బ్రతికేందుకు పోటీ - కుబేరుడు ఇంకా కుబేరుడు కావాలని ప్రయత్నం....పొట్టనింపుకోవాలని ప్రయత్నం....ఈ ప్రయత్నంలో సమాజంలో ఒక వ్యక్తికీ, మరొక వ్యక్తికీ పోటీ.... ఆపోటీలోనే మంచి, చెడులనేవి ఎక్కడికో ఎగిరి పోతాయి. ఉన్నత అంతస్థులో ఉన్నవాడు ఉన్నతంగా వంచనచేసి, కోట్లు సంపాయించుకో గలడు. 'పై పెచ్చు ఉదాత్తుడనని అనిపించుకోనూగలడు. చిన్నవాడు వంచనచేస్తే నగ్నంగా నలుగురికి కన్పిస్తుంది. నలుగురితోనూ చీవాట్లు తింటాడు.

చూడండి మరి: సమాజమంతా వైవిధ్యమయం. అంతా అగమ్య గోచరంగా కన్పిస్తుంది మొదట్లో - కాని నిశితంగా చూస్తే అర్థంచేసు కోగలం - పరిష్కరించుకోగలం. ప్రకృతిని జయించగలుగుతూవున్న మానవుడు, తన సమస్యలను పరిష్కరించుకొనలేడు అని చెప్పడం

వాస్తవంకాదు .... ప్రతి అడుగునా పోటీయే. బహుశా ఇదంతా స్వల్ప విషయాలని ఉదాత్తులంటే అంటారేమోగాని, అది ప్రత్యక్షసత్యం-బండి తోలుకుంటానికీ లైసెన్సు, రిక్షా తొక్కడానికీ లైసెన్సు - ప్రతిదానికీ లైసెన్సు - ఇదంతా సంఘం పటిష్ఠంగా ఉండడంకోసమే నంటారు! కావచ్చు. కాని సంఘ మనేదికూడ సంఘంలో భాగస్థులుగా ఉండే ప్రతివాడికీ తిండి చూపవలసిన బాధ్యత ఉందిగా మరి! లైసెన్సు లేనివాడికీ, ఉన్నవాడికి పోటీ. అర్ధరూపాయి దగ్గరపోటీ. ఈ కూటి కోసం పోటీని, యజమాని ఉపయోగించుకుని, చౌకగా కూలిస్తానంటాడు. జట్కాకూ, రిక్షాకూ, వంబెద్దు బండికీ, తోపుడు బండికీ, లారీకీ, వంబెద్దు బండికీ. యంత్రానికీ, చేతివృత్తికీ అంతాపోటీ. వైరుధ్యం.... వైరుధ్యం, వైరుధ్యం. దీన్ని పరిశీలించ కుండానే, ఉదాత్తంగా ఆలో చిస్తున్నామని గొప్పలు చెప్పుకుని, ఆత్మవంచనచేసుకుంటూ ఏవేవో తమకు అర్థంకాని మాటల్లో, మాట్లాడుతారు. ఇదంతా ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే, 'మానవత్వ గౌరవం' కోసం తీసుకునేచర్య అతని పొట్టకొట్టకుండా ఉన్నపుడే అది సరైనచర్య, ఉపయోగమైన చర్య అవుతుంది. లేదా అంటే మరొక బ్రతుకు తెరువు చూపకుండా ఎట్టాగో బ్రతుకు అని చెప్పేవారికి, ఎట్టాగో బ్రతికేవాడు, సంఘంకోసం బలికావలసిన పనిలేదు నిజానికి.

బహుశా పెద్దలకు పెద్ద విషయాలే కాని ఇట్టాంటి అల్ప సమస్యలు పట్టవు కాబోలు - బహుశా ఈ సమస్యలు, అనాగరిక అలగాజాతివే కాబోలు మరి వారి దృష్టిలో - అవును మరి! ఒకవేళ వారికి పనిచూపే బాధ్యత తీసుకుంటే, అలగా జనానికి ఆశలు చిగురించవచ్చు - ఆశలు చిగిర్చి వృక్షం కావచ్చు - ఆ సత్యం బహుశా పెద్దలకు తెలిసే ఉంటుంది- అందుకేనేమో ఆశలు చూపడంలోనే అగ్రస్థానం వహించారు!

అదిగో ఘాటీవద్ద ఏదోగలభా జరుగుతోంది....మీరేమైనా అనండి. అక్కడ మాత్రం గలభా జరుగుతోంది....అల్ప విషయాల కోసం అనాగరికుల వ్యవహార మంటారో, లేదూ. అందులోనూ తెలుసుకో

వలసిన సత్యముందనుకుంటారో, లేదో, అది మీ యిష్టం—మన యిష్టాయిష్టాలతో నిమిత్తం లేదిక్కడ.

ఇద్దరు ప్రయాణీకులు రిక్షావాణ్ణి బండికడతావా అని అడిగారు. రిక్షావాడుకడతానన్నాడు. అర్ధరూపాయి బాడుగ కుదిరింది. ఇద్దరూ రిక్షాలో ఎక్కారు,

ఈ సంగతి దగ్గరలోనే ఉన్న జట్కావాళ్ళు విన్నారు. గోవిందయ్యకు జట్కాకట్టిన బండివాడు దురుసుగా ముందుకువెళ్ళి, ఇద్దరిని ఎక్కించుకున్న రిక్షావాణ్ణి ఆపి.

"ఒక్కడికంటె ఎక్కువ ఎక్కించుకోడానికి ఈల్లేదుగదా! ఎందు కెక్కించావురా? ఆల్లని దింపేయ్" అన్నాడు బండివాడు.

పోరా నువ్వెవడవ్ అడగడానికి నాయిట్టం - నీ బాబుగాడితో చెప్పుకో" అన్నాడు రిక్షావాడు.

"అరె! నాయాల: బాబూ గీబూ ఎత్తావంటే గోబ గుయ్యమంటది జాగ్రత్త" అన్నాడు బండివాడు.

బళ్ళవాళ్లు బండివాణ్ణి, రిక్షావాళ్ల రిక్షావాణ్ణి, సమర్థించారు. మాతుల్లోకిదిగింది వ్యవహారం. ఇదంతా మనకెందుకని ప్రయాణీకులు జారుకున్నారు బూతులుపోయి చేతులు చేతులు కలిసినయ్. ఇక రాళ్లు, సోడా బుడ్లు....అనుకోకుండా సంఘటన జరిగిపోయింది: ముగ్గురు స్పృహ లేకుండా పడిపోయారు. మిగతావాళ్ళు కాళ్ళకు బుద్ధిచెప్పారు.

ఈ ఘాటీ గోవిందయ్య మేడకు సమీపంలోనే. మేడమీదనిల్చుని కాట్లకుక్కల్లా పోట్లాడుకున్న వారిని చూచాడు, అసహ్యించుకున్నాడు. 'అల్పులు అణాకోసం కొట్టుకుంటున్నారు ఛీ! అనుకున్నాడు. ఇంతలో వికటంగా "హ్హ! హ్హ!" అని నవ్వు వినిపించింది. ఎందుకు నవ్వుతున్నావట్టూ? గోవిందయ్య చూశాడు ఆ వ్యక్తిపై ఆ వ్యక్తి ఎవరోకాదు, తను ఇనుపపెట్టెలో బంధించిన "లక్ష్మి."

గోవిందయ్యకు చెవిలో తారకమంత్రా న్నుపదేశించినట్లు "అల్పు లనుకునేవాళ్లంతా ఏకమైతే నీ అధికారం, పెత్తనం కాస్తసున్నా. తెలిసిందా! విభజించు! పాలించు!" అని చెవిలో గొణిగింది.

గోవిందయ్య ముఖంపై నవ్వుతాండవమాడింది. 'లక్ష్మి'ని మరొక సారి గాఢంగా కౌగలించుకొని, నమస్కారం చేశాడు,

పోలీసులు, పడిపోయిన ముగ్గురిని, మరో యిద్దరిని జైల్లో పెట్టారు, ఇందులో ఒక్కడికీ కనీసం సొంతబండికూడా లేదు.



# జ్యోతిషం

## 1

దట్టమైన చీకటిలో, కారుమబ్బుల గొడుగుక్రింద నిర్భయంగా రైలు పొగలు కక్కుతూపోతోంది, చల్లటిగాలి జోరుగా రైలు పెట్టెలోకి వస్తోంది. ప్రొద్దుపోయినా, ప్లీడరయిన కుటుంబయ్యకు నిద్రపట్టక తదేక ధ్యానంలో ఆ గాఢాంధకారంలోకిచూస్తున్నాడు. చల్లటిగాలి ఆలోచన లలో వేడి ఎక్కిన అతని మనస్సుకు ఎంతో హాయినిస్తోంది. ఒక సిగరెట్టు వెలిగించాడు. ఆలోచనలలో, సిగరెట్టును దమ్ముమీద దమ్ము లాగుతున్నాడు.

ఏవేవో అలోచనలు ఆయన స్మృతి పథంలో అలల్లా ఒకదాని వెనుక ఒకటి పరుగెత్తుకు వస్తున్నయ్....ఎన్నో ప్రశ్నలు?....సమాధా నాలు....తిరిగి ప్రశ్నలు....తిరిగి సమాధానాలు....అనంతంగా వచ్చే ఆలోచనలు ఒకచోట ఆగిపోయాయి.

తనమిత్రుడైన రామనాథానికి వయసు కాని వయసులో ఈ పాడు బుద్ధి ఎందుకు పుట్టిందన్న ప్రశ్నకు ఎంత గాలించినా కుటుంబయ్యకు సమాధానం దొరకడంలేదు....సమాధానం కొరకు అతని ఆలోచనలు రివ్వున తిరిగాయి....సమాధానం లభించలేదు.

జీవితం ఎంత చిత్రమైనది! జీవితం ఎల్లప్పుడూ ఒకేవిధంగా వెళ్ళమారి పోయిందని భావించడం ఎంత పొరబాటు!....వేదాంతంలో పడ్డాడు కుటుంబయ్య, ఈ పది సంవత్సరాల్లో తాను చెప్పినట్లు రామ నాథం ఏమి విన్నాడు గనుక, ఇవ్వాళ వింటాడని తాను రామనాథం వద్దకు ప్రయాణమైనట్లు? ఈ ప్రశ్న కుటుంబయ్యను చల్లబరచింది.... కొంచెంసేపు ఆలోచనలు మొద్దుబారినయ్...."ఇదివరకు వినలేదు. గనుక, ఇప్పుడు వినడని ఎక్కడుంది? వినవచ్చునేమో" అని ఏదో కుటుంబయ్య చెవిలో ఊదింది. చలనమూ, జ్ఞానమూ ఉన్న మనస్సు మారకూడదని ఎక్కడుందనుకున్నాడు కుటుంబయ్య.

మళ్ళీ ఇంకో ధర్మసందేహం కుటుంబయ్యను పీడించింది. 'రామనాథం తనంటే నిజంగా ఎంతగౌరవిస్తాడు! అయినపుడు మరితాను చెప్పిందాన్ని అతడెందుకు గౌరవించడూ?" దీనికి కుటుంబయ్య ఈవిధంగా సమాధానం చెప్పుకున్నాడు. 'తనమాట వినకపోయినంతమాత్రాన, తనంటే గౌరవం పోయిందని అనవసరంగా అనుమానపడి తన మనస్సును కష్టపెట్టుకుని, రామనాథం మనస్సును ఎందుకు కష్టపెట్టాలి ?.... అసలు రామనాథంలో ఈమార్పు ఎందుకు వచ్చినట్లు ?'

రామనాథం తనకు వ్రాసిన ఉత్తరాలసంగతి, తా నతనికి వ్రాసిన ఉత్తరాలసంగతి కుటుంబయ్యకు జ్ఞాపకం వచ్చింది. తన మాటకు విలువలేదని నిష్ఠూరంగా రామనాథానికి తాను వ్రాసినసంగతి గుర్తు వచ్చింది. తన మాట విననందులకు బాధను వెలిబుచ్చుతూ రామనాథం క్షమా పూర్వకంగా వ్రాసిన జాబు కుటుంబయ్య మనస్సులో మెదిలింది.

తన స్నేహంయొక్క ప్రభావం పిసరంతయినా అతనిమీద పడనపుడు, ఎందుకీ స్నేహం అని కోపంవచ్చి, ఒకదశలో కుటుంబయ్య రామనాథానికి ఉత్తరాలు వ్రాయడం మానివేశాడు. అయినా కుటుంబయ్యకు రామనాథం విషయం తలంపుకు వచ్చినపుడల్లా ఎందుకో జాలి !

# 2

రామనాథం కొడుకు రామారావు కుటుంబయ్యకు ఉత్తరాలు వ్రాశాడు. ఆ ఉత్తరాలు చదివితే, రామనాథాన్ని గురించి ఎందుకో జాలి పడాలని కుటుంబయ్యకు అనిపించేది. నిజానికి రామనాథం చర్యలవలన, బాధలు పడుతూన్న కుటుంబాన్నిచూచి జాలిపడాలనుకునేవాడు కుటుంబయ్య. దాదాపు ముప్పై సంవత్సరాల దాంపత్య జీవితంలో పొరుపులంటే తెలియని రామనాథం కుటుంబంలో, ఈ ఏడెనిమిది సంవత్సరాల్లో ఎందుకు వైషమ్యాలు వచ్చినట్లు ? ఆకుటుంబాని కెందు కీ దురవస్థ

రావాలి? బందరువెళ్ళి రామనాథాన్ని కలుసుకున్నప్పుడు, అతడు తనకు చెప్పినమాటలు కుటుంబయ్యకు చెవుల్లో గింగురుమన్నాయ్.

ప్లీడరు చదువుతూన్న కొడుకు వాదసలువిని, రామనాథం భార్య జగదాంబనుచూస్తే ఎంతజాలివేసిందో రామనాథం మాటలువిన్నతరువాత కుటుంబయ్యకు అడనిమీద అంతే జాలివేసింది. ఏది ఏమైతేనేం ఆ కుటుంబానికి దురవస్థ వచ్చినందుకు కుటుంబయ్య విచారించాడు.

రామనాథం కుటుంబయ్యతో దాపరికం లేకుండానే అప్పుడిలా చెప్పాడు :

"నేను కుటుంబయజమానిని. నా తలిదండ్రులు నాకిచ్చిన కొంచెం ఆస్తితో ఎట్లాగో ఈ డాక్టరు చదివాను. దాదాపు లక్షరూపాయలు ఆస్తి సంపాదించి ఇచ్చాను. నా పెళ్ళాం, ఓడ్డలూ హాయిగా కాలుమీద కాలు వేసుకుని తింటున్నారే?

పోనీ నేను సంపాదనంతా పాడు చేస్తున్నావనుకో. పోనీ నన్నింత అల్లరి చేస్తున్న ఆ మహాయిల్లాలు జాగ్రత్తచేసి, పొదుపుచేసింది ఎక్కడ? ....పోనీ ఆ మహా యిల్లా లేమైనా మహారాజు వంశంనుండి ఊడి పడిందా?

అదీకాదే....సిగ్గువిడిచి, పంపు వద్దకు వెళ్లి నీళ్ళు తెచ్చుకునేది, ఈవైభోగా లనుభవిస్తూంటే, సంసారం ఇట్లా ఉండక ఎట్లాఉంటుంది?.... దానిఅదృష్టం పండింది. నాపెళ్ళాం అయింది....నేను సంపాదించి తెచ్చి చేతిలోపోస్తే, ఇవాళ నామీదపెత్తనం చేస్తోంది....సిల్కుచీరలూ, నగలూ, నెక్లెసులూ, - బజరులో ఏది చూస్తే అదికావాలి. ఇప్పటికి నలభై అయిదేళ్లు వచ్చినా, ఈ సింగారింపు తగ్గిందా? అయినా నేనెప్పుడూ పల్లెత్తు మాట అనలేదే? అనవసరంగా ఎందుకు ఖర్చుపెడతావని అడుగ లేదే?....నేను చేసిన పెద్దతప్పుల్లో అదొకటేమో కూడా?.... అడగండి! నేను చెప్పే దాంట్లో వీసమెత్తు అబద్ధముందేమో?....కాకపోతే నేను ఎప్పుడూ ఒకటి చెబుతూ ఉండేవాణ్ణి 'ఒకరిని చులకనగా చూడవద్దు.

మనమేం అష్టైశ్వర్యాలతో పుట్టలేదు. ఏదో భగవదనుగ్రహం వలన మనకీ ప్రాప్తికల్గింది!'

అట్లాంటిసంతా, ఇప్పుడీ మహా యిల్లాలికి గాలిలో ఎగిరిపోయింది. దాన్నంతటనీ అది అప్పుడే గంగలో కలిపేసింది. రామారావు సంగతి మాత్రం ఏమిటి నిజానికి? పరాంకుశం విషయంలో ఏం లోపం వచ్చింది? వాళ్ళ ననవలసిన పనేముందిలే?....పెద్దదానికి దానికే విచక్షణ లేకపోతే.

అసలు వీళ్ళకు పట్టినబాధ, నేనేదో చేస్తున్నానని కాదు. ఇది వరకు ఇస్తున్నట్లుగా ఇప్పుడు వీళ్ళకు ఎక్కువ డబ్బు ఇవ్వడం లేదండి! ....అసలు తంటా అక్కడ వచ్చింది. అయినా ఇప్పుడైతే మాత్రం వాళ్ళకేం లోపం వచ్చింది? రామారావు పెళ్ళి సలక్షణంగానే అయింది గదా! పెద్దమ్మాయి పెళ్ళి అయిందిగదా! పోతే ఇద్దరు పిల్లలు. వాళ్ళకూ వయస్సువస్తే ఆ విధంగానే జరిగిపోతుంది." అని రామనాథం ఊపిరి తిరగకుండా చెప్పేస్తుంటే కుటుంబయ్య ఒక ప్రశ్న వేశాడు.

"రామనాథం నువ్వు చెప్పింది నిజమే! ఇప్పుడు మాత్రం పూర్వం వలెనే నీ సంపాదనంతా ఇంటివద్ద ఎందు కివ్వగూడదు? నీ దురలవాట్లు, ఖర్చులు కొంత తగ్గించకూడదా? నువ్వు ఇచ్చే నాలుగువందల రూపాయలు ఇంటికేం సరిపోతయ్?"

'దురలవాట్లు' పేరు ఎత్తితే చాలు రామనాథానికి అరికాలుమంట. తాను పాడైపోతాననే బాధకాదు తన కుటుంబాని కున్నది. తాను డబ్బు ఇవ్వడంలేదనే బాధ అని రామనాథం అభిప్రాయం. రామనాథం కుటుంబయ్యను ఇట్లా ప్రశ్నించాడు.

"నా దురలవాట్ల విషయానికి తరువాతవస్తాను. కుటుంబం: నాకు ఒక్క విషయం చెప్పు. నేను వీరికి కావలసినంత డబ్బు తెచ్చిపడేస్తుంటే, కాస్త ముద్దసదేసి, లాంఛనంగా నన్ను గౌరవిస్తారన్నమాట! ప్రేమ పలుకులు పలుకుతారన్నమాట. వాళ్లు ఎప్పుడు డబ్బు అడిగితే

అప్పుడివ్వకపోతే, ఆరోజే నేను చెడ్డ వాడినన్నమాటేగా? అంతవరకూ నాపైన చూపుతూన్న గౌరవం తగ్గినట్టేగా!"

ఇంతలో జగదాంబ మొదలు పెట్టింది. "ఎందుకండీ! నామీద అన్ని అభాండాలు వేస్తారు? మీ మీద చూపుతూన్న గౌరవమంతా నటన అంటారు? నే నెప్పుడైనా పల్లెత్తుమాట అన్నానా?....నోరు మెత్తని దాన్ని చూస్తే అందరికీ అనబుద్ధేస్తుంది" అంటూ ఆమె కంటతడిపెట్టింది.

"ఊరుకో అమ్మా! సంసారం అన్న తరువాత ఏవో వస్తూంటాయి" అని సర్దిచెప్పాడు కుటుంబయ్య.

"ఈ దొంగ ఏడ్పులకేంలే. నువ్వెంతటి ఆడదానివి కాకపోతే నెల్లూరినుండి ఆయన్నుకూడ పిలిపించ గల్గుతావ్! ఇక్కడనన్ను అల్లరి చేసింది చాలదూ? ఏంకుటుంబం!....వీరంతా గౌరవించేది డబ్బిచ్చినంత కాలమేగా! సూటిగా చెప్పండి" అని రామనాథం కుటుంబయ్యను ప్రశ్నిస్తే అతడుక్కిరి బిక్కిరయ్యాడు.

"రామనాథం! నువ్వు మరీ ఊహిస్తున్నావయ్యా పెళ్ళాం, మొగుడూ, కొడుకూ, కూతురూ అన్న తర్వాత ప్రేమలేకుండా ఎట్లా పోతుందిలే" అని కుటుంబయ్య ధైర్యంగా అన గల్గాడు.

"ఎన్నైనా చెప్పండి! కాస్తోకూస్తో ఉన్న మనబోటి కొంపల్లో వచ్చే తగూలు ప్రధానంగా డబ్బు దగ్గరే కదా! కొడుకేమిటి? కూతు రేమిటి? ఒక కుటుంబంలోనే, ఒకళ్ళకు పెట్టి, మరొకరికి పెట్టకుండా ఉంటే సహిస్తారా?....అది లోకధర్మం అండి!....డబ్బున్నపుడేనండి మానవుణ్ణి అందరూ గౌరవిస్తారు....ఆ సూత్రమే కొంచెం ఇంచుమించు, ఇంట్లో వాళ్ళకూ వర్తిస్తుంది. డబ్బును గురించి తగూ ప్రారంభమై ఇక దానిపై ఏవో చిల్లర మల్లర విషయాలన్నీ ప్రోగై అసలు మూలం అడుగున మాటునపడి పోతుంది అంతే.

ఇది నా స్వానుభవం....ఇంట్లోనూ బయటా కూడ అంతే. ఇక నాదురలవాట్లసంగతంటారా" అని రామనాథం కొంచెంసేపుఆగిపోయాడు.

ఇదంతా కుటుంబయ్య ప్రశాంతంగా వింటున్నాడు. రామనాథంలో ఆవేశం తగ్గింది. తన దురలవాట్ల సంగతి చెప్పవలసి వచ్చేసరికి రామనాథం కొంచెం ఇరుకున పడ్డాడు. ఏదో తప్పు చేసినవానిలా వెనకాడు తున్నాడు రామనాథం, తన్ను తాను సమర్ధించుకుంటూ రామనాథం ఏదో చెప్పాడు. జగదాంబ మాత్రం ఊరుకున్నదా? లోపలి నుండి ఒక సీసా తెచ్చి అక్కడ పెట్టి "దీనికి చాలడం లేదన్నయ్యా ఎంతడబ్బు అయినా, ఈ పాపిష్టిది మాకుటుంబాని కొకశత్రువై కూర్చుంది" అంటూ కంటనీరు కార్చింది. "దీనివలన ఇల్లూ, వళ్లూ గుల్లయిపోతూంటేచూస్తూఊరుకుంటే మేం మంచివాళ్ళమన్నమాట?.... అయినా చూస్తూ ఎలా ఊరుకోబుద్ధి పుడ్తుంది చెప్పు? 'ఏమిటండి ఈ పని అంటే చాలు దానితో ఇక రభస. మైకం వల్లనో ఏమో తెలియదు కాని, నన్ను నానా తిట్లు" అని ఆమె కన్నీరు కార్చింది.

రామనాథానికి కోపం వచ్చింది. సీసా లోనికి పట్టుకు వెళ్ళి పోయాడు.

రామనాథం వాదన కుటుంబయ్యకు వింతగానే తోచింది. ఒక యంత్రంలా ఎప్పుడు ఇల్లూ - ఆస్పత్రీ; ఆస్పత్రీ-ఇల్లూ జీవితం ఏమి టనిపించిందంటా డేమిటి! అరవయ్యో పడిలో పడబోయే రామనాథం? ఏమిటో అలా బుద్ధి పుట్టిందంటా డేమిటి? నిజంగానే యాభయ్యోపడి వరకూ నిప్పులాంటి జీవితాన్ని గడిపిన రామనాథానికి, అలా ఎందుకు బుద్ధి పుట్టిందో?

అవును, రామనాథం దాచుకోకుండానే కుండబ్రద్దలు కొట్టినట్టు చెప్పేశాడు. 'మధువు', 'ప్రేయసి'ని గురించి ఉమర్ ఖయ్యాం చెప్పిన దంతా నిజం. జీవితం అశాశ్వతం, పాప - పుణ్యాల బేరీజు తర్వాత సంగతి! నీతులు వట్టి బూటకం....మధువు!.... ఎంతటి శక్తి దానిలో వున్నది!.... విచారమన్నది దరిచేరనీయదే!.... మనస్సును స్వర్గ వీధుల్లో విహరింపచేస్తుందే! అందుకే దానికింత మంది బానిస లవుతున్నారు.

ప్రేయసి !....ప్రేయసి కౌగిటిలో లీనమైతే ఈ బహిః ప్రపంచ బంధనాలు పటాపంచలై పోతాయే !.... ప్రకృతిలో ఎంతవైచిత్ర్యం ఇమిడి ఉంది ?....అన్నీ పరస్పర విరుద్ధ విషయాలు !....ఒకటి లేకుండా మరొకటిలేదు....అన్నింటినీ మరపించే ప్రేయసి లాలన....ఎలా వదలుకో గలను" అని కవిత్వ ధోరణిలో తన్మయుడై రామనాథం చెప్పాడు.

కుటుంబయ్య తెల్లపోయాడు....

రైలుకూ, రైలునునడిపే డ్రైవరుకూ విశ్రాంతి కావలసి వచ్చిందికాబోలు ! విజయవాడలో విశ్రాంతి కుటుంబయ్య కాఫీత్రాగాడు. బందరుబండి ఎక్కాడు.

రామారావు, జగదాంబలు కుటుంబయ్యను తప్పక రావలసినదిగా కోరారు. ఉంచుకున్న దానికి ఆస్తినంతా వ్రాసేందుకు రామనాథం కంకణం కట్టుకున్నాడని వారు వ్రాశారు....పోనీ ఎన్నిచేసినా, ఈ తుది ఘడియల్లో రామనాథానికి ఈ పాడుబుద్ధి ఎందుకు పుట్టిందీ! అంతా కర్మ' అనుకున్నాడు కుటుంబయ్య.

ఇప్పుడుమాత్రం రామనాథం తనమాట వింటాడని ఏముంది ?—అసలెందుకు తాను వెళ్లడం ?....కేవలం జగదాంబలోపం ఏమాత్రం లేకుండానే రామనాథం ఈ నిర్ణయానికి వస్తాడా ! ఈ ఆలోచనతో కుటుంబయ్య సతమత మవుతున్నాడు.

ఒక సందర్భంలో రామనాథం తనకు వ్రాసిన ఉత్తరంలో విషయాలను అప్పుడు చదువుతూన్నట్లుగా కుటుంబయ్యకు తోచింది.

" నీ సోదరి సమానురాలైన జగదాంబ నన్నుపెట్టే యాతనలు చెప్పుకోవడం సిగ్గుచేటు....ఆత్మీయుడవు కాబట్టి, చెప్పకున్నా తప్పుచేసని వ్రాస్తున్నా....ఈ విషయంలో తల్లికి తాసట పిల్లలంతా....నేను తెచ్చు కుని దాచిన డబ్బంతా నాకు తెలియకుండానే, జగదాంబ, రామారావులు కాజేస్తున్నారు సంపాదించే నా చేతిలో నమ్మికీలేక ఎంతో యిబ్బంది

పడవలసివస్తోంది. అప్పులు చేయవలసివస్తోంది. నామనస్సు ఆ విధంగా వ్యాకుల పడుతోంది....ఆస్పత్రికి వెళ్లడానికి బుద్ధిపుట్టడంలేదు.

అడగరాని వాళ్లనందరినీ నేను ముష్టిఎత్తవలసి వస్తోంది. నా డబ్బు కొరతనూ, నా బలహీనతలనూ, ఆధారం చేసుకుని, నావిరోధులు కొంత మంది నా ఫీజును డబ్బు రూపంలోగాక, వస్తురూపంలో చెల్లించడం ప్రారంభించారు....తనకు తానుగా కనీసం కొన్నివందలు సంపాదించే వ్యక్తికి, దమ్మిడీ దొరక్కుండా ఇంట్లోవాళ్లు చేస్తూంటే, మనస్సు ఎంత క్షోభ పడుతూందో ఆలోచించండి?

అవును!....ఎవరెన్ని చెప్పినా నా బలహీనతల నుండి బయటపడే శక్తి నాకు లోపించింది. ఈ మనస్సు క్షోభను మరచేటందుకు, నిత్యమూ మధుపానీయంలో మునిగితేలవలసి వస్తూంది... డబ్బుదొరక్క ఒకోసారి స్పిరిట్ త్రాగిన ఘటనలున్నాయ్!....నా యీ దురవస్థకు ఎవరు కారకులు?

ఈ దుర్భర పరిస్థితి దారుణ ఫలితాలు ఎలా వుంటాయో చెప్పడం ఎవరికైనా కష్టమే!....తనను పలుకరిస్తేనే దాని పరువు అంతా పోయి నట్లుగా భావించే స్థితికి జగదాంబ వచ్చింది. తనను ఇంటివద్ద ఏహ్యంగా చూస్తున్నారు.

ఎందుకైనా కానివ్వండి! తనను లాలించి, కమ్మటిమాటలు చెవిని పడవేసే వేశ్య యింటివద్దనే ఉండాలని నిర్ణయించుకుంటే అది తప్పు కానేరదు.

అందరి శ్రేయస్సు కొరకూ, మీ సోదరికి సలహా యివ్వండి" రామనాథం వ్రాసిన ఈ ఉత్తరానికి కుటుంబయ్య సమాధానమే వ్రాయ లేదు. జగదాంబ చేస్తూన్నపని మంచిదేనని కుటుంబయ్య భావించాడు.

అట్లాంటపుడు తాను చెప్పినట్లు రామనాథం ఇప్పుడు వింటాడా? విననపుడు ఎందుకూ తను వెళ్ళడం?....అందులోనూ రామనాథం ఉంపుడుకత్తె ఇంట్లో ఉన్నాడాయె....కడసారిచూపులైనా అందితేచాలు ననుకొన్నాడు కుటుంబయ్య.

అబ్బా! ఏమిటి?....ఒకమిత్రుని కొరకు వేశ్యగడప త్రొక్కవలసి వస్తోందే అనే బాధ ఒకవైపు కుటుంబయ్యను వేధిస్తోంది.

ఏమైతేనేం! చివరిరోజుల్లో, అల్లరిపడి, నలుగురితోనూ నవ్వించుకుని ఎక్కడో వేశ్యయింటిలో చనిపోయే దుస్థితి రామనాథాని కేర్పడినందుకు కుటుంబయ్య జాలిగా ఒక నిట్టూర్పు విడిచాడు.

ఉబ్బసవ్యాధిగ్రస్తునిలా నెమ్మదిగా రైలు బందరుచేరింది, అదుర్దాతో సైకిల్‌రిక్షా ఎక్కాడు. రామనాథంఇంటికి వెళ్ళాడు. రామనాథం మీద ఎన్ని చెప్పాలో అన్ని జగదాంబా, పిల్లలూ చెప్పారు. అవన్నీ బాధతో విన్నాడు కుటుంబయ్య. మిత్రుడు రామనాథం ఎదురుగా ఉన్న యింట్లోనే ఉన్నాడని వారు చెప్పారు.

# 3

మిత్రుని కొరకు వేశ్యయింటికి కూడ పోవలసి వచ్చిందే అని బాధపడుతూనే కుటుంబయ్య భారంగా, ఆవేశ్య యింట్లో కాలు బెట్టాడు. అయన్ను చూడగానే, ఆవేశ్య యింట్లోకి వెళ్లి పోయింది. రామనాథం చూసి, కుటుంబయ్యను కూర్చోమని సైగచేశాడు. కుటుంబయ్య కూర్చున్నాడు.

'ఎలా ఉంది వంట్లో' అని కుటుంబయ్య ప్రశ్నించాడు,

'ఎట్లా ఉండేదేముంది? అందరి శనీ కొద్దిగంటల్లోనే వదల్తుం దేమోలే!....ఎట్లాగయితేనేం; అందరూ పుణ్యం కట్టుకున్నారుగా! అని ఎగశ్వాసతో బాధపడుతూన్న రామనాథం 'ఒక గ్లాసులో అదిపొయ్యి' అని అడిగాడు. అతని ఉంపుడు కత్తె ఓ చిన్న గ్లాసులో బ్రాంది పోసి యిచ్చింది. అది రామనాథం పుచ్చుకున్నాడు,

"అవన్నీ మరచిపోవాలి రామనాథం! అధైర్యపడితే ఎల్లా?"

"డాక్టర్లు కూడా నయమవుతుందని చెబుతున్నారు." అంది వేశ్య,

"డాక్టర్లు ప్రాణాన్ని పోస్తారా ? అదొక పిచ్చిదిలే కుటుంబయ్యా! పోతానన్న భయం నాకేంలేదు." అన్నాడు రామనాథం. చప్పుడు గాకుండా వచ్చిన కొడుకు రామారావును రామనాథం చూచి పొమ్మని ఒక పొలికేక పెట్టాడు- దాంతో రామారావు చల్లగా జారుకున్నాడు. రామనాథం ఆయాసం కొంచెం తగ్గింది,

"కుటుంబయ్యా! సమయానికి వచ్చావు....ఎందుకు వచ్చినా, సమయానికే వచ్చావు....నాకున్న భయమల్లా, నాకు కావలసినవారని లోకం అనుకుంటూండే, వాళ్ల ప్రవర్తన నేను చచ్చినా నా వెంట ఎక్కడ పడ్తుంతో నని భయం........అంతే" అన్నాడు రామనాథం.

అదంతా నీ అనుమానం. అయిన వారికి ప్రేమ ఉండక ఎలా ఉంటుంది ?" అన్నాడు కుటుంబయ్య కొంచెం భయంగా.

"అట్టా అంటారని తెలుసు....ఆ అయినవారు నీకేమి చెప్పి ఉంటారో కూడ ఊహించడం ఏమంత కష్టమైన పనికాదు...ఏమున్నది కుటుంబం!....ఈ లోకం మహాచెడ్డది....పాపిష్టి డబ్బున్నది చూచావూ! ....అది మానవులను ఎంత నీచానికైనా దింపుతుందయ్యా! నావాళ్ళు! ....నావాళ్ళు నన్ను ఎంత అల్లరిపెట్టారో, ఎంత బాధ పెట్టారో, ఎన్ని అవమానాలపాలు చేశారో ఆ భగవంతుడికి తెలియాలి... లేకపోతే నాకు మాత్రం ఇక్కడ ఉండవలసినకర్మ ఎందుకుపడ్తుంది?....చచ్చేటప్పుడైనా ఉన్నమాట చెబితే పోతుంది. ఎంతమంది నమ్మాలారన్నది నా కక్కర్లేదు. ....ఇది వేశ్య అయినా, నా ఆలనా పాలనా చూచింది....ఈ దురవస్థలో, చేసుకున్న పెళ్ళాంకన్నా ఎక్కువ చాకిరీ చేస్తోంది....నిజంగా అందు వల్లనే నేను ఆత్మశాంతితో చనిపోతున్నాను. అది చేస్తున్న సేవ ప్రేమతోకాదు; డబ్బుకొరకని కొంత మంది మిత్రులన్నారు....కావచ్చు ....ఆ డబ్బు ఈ చాకిరిచేసి అది సంపాదించుకోనక్కర్లేదుగా....నీకు చెబుతున్నాను....నమ్మితే నమ్ము లేకపోతేలేదు.

నా వద్ద నుండి ఏం ఆసించిందో నాకైతే తెలీదు....నేను అడిగి నపుడు డబ్బు ఇచ్చేది....అడిగి అడిగి, చివరకు నాకే ముఖం చెల్లక

అభిమానంతో బాధపడుతూంటే. నాకు చేతినిండా డబ్బు ఇచ్చేది.... నా బాధను అది గ్రహించింది.... నా అభిమానాన్ని అవమానించక గౌరవించింది.... వేశ్యకు కావలసింది డబ్బు.... నే నిస్తున్నది ఏమీలేదు.... ఎందుకో దానికా బుద్ధి పుట్టింది.... మనం గుణాన్ని చూడకుండా, పైపై ప్రవర్తనను, బ్రతుకు తీరులను చూచి నిర్ణయాలు చేస్తుంటాం.... గుణం అంతతేలిగ్గా తెలియదు కుటుంబం!"

రామనాథం చెప్పింది కుటుంబయ్యకేమీ తలకెక్కడంలేదు. వేశ్యాలోలుని వేదాంతం ఇట్లాగే వుంటుందనికూడా అత డనుకున్నాడు.

"రామనాథం ఒక సంగతి అడుగుతాను-ఇప్పుడైనా చెబుతావా?"

"అడుగూ.... ఇంకా దాచుకో వలసిన పనేముంది?"

"నీకీ వయస్సులో ఇట్లాంటిబుద్ధి పుట్టడానికి కారణం ఏమిటి?.... నీలో ఎవరూ ఊహించని మార్పుకు కారణం ఏమిటి?

"అదా సంగతి? .... ఆదేముందిలే కుటుంబం! విషయాన్ని అంతర్గతంగా తరచిచూడాలి.... మనసు ప్రధానం.... మనసు మంచిదైనా జీవిత విధానంవలన, ఆ మంచితనం కప్పడిపోతూంటుంది.... నీ చేతిలో చేయివేసి చెబుతున్నాను.... మీ రందరూ నేను ఈ వేశ్య కొంపలో ఉంటున్నందుకు అసహ్యించుకుంటూ నా గురించి జాలిపడుతున్నారే! ఆ వేశ్యాగృహమే చివరకు నాకు ఆశ్రయమైంది!.... అదీ చిత్రం?.... ఈ రోజు వరకూ, అదితాను నాకిచ్చిన డబ్బును గురించికూడ కనీసం అడుగ లేదు...." అని రామనాథం కృతజ్ఞతతో చెప్పాడు.

"ఆమె తెలివైంది.... నీ ఆస్తిఅంతా ఎట్లాగయినా ఆమెకే వస్తుందని ఊరుకుంది" అన్నాడు కుటుంబయ్య.

"అట్లాగాబాబూ!.... అయితే నీ సోదరేనా అంత చిత్తశుద్ధితో కూడిన ఆదరణ చూపేది?.... నిన్ను పంపింది ఆస్తికొరకుగాదూ?" అని రామనాథం ఉద్రేకంగా ప్రశ్నించాడు.

"నీ కెందుకుగాని ఆ బాధ....నేను పోతానులే" అన్నాడు కుటుంబయ్య కొంచెం బెదరింపుతో, "కూర్చోవయ్యా !.... ఆ సంగతి ప్రస్తావించనులే....నీ వడిగిందికూడ పూర్తిగా చెప్పగలిగితే అది మెరుగే" అని గుండెను అదుముకున్నాడు రామనాథం. రామనాథానికి బ్రతకనేమో అనేది మరింత ధృవపడింది. గబగబా చెప్పాలనుకుని ప్రారంభించాడు.

నావద్ద వైద్యం చేయించుకునే రోగికి, ఒక గొప్ప జ్యోతిష్కుడు జోస్యం చెప్పాడు, నెలరోజులముందుగానే, ఫలానారోజు ఆరోగి చచ్చిపోతాడని. ఆ విధంగానే ఇంచుమించుగా అతడు చనిపోయాడు,

దాంతో నాకూ జ్యోతిష్యం చూపెట్టుకోవాలని సరదా పుట్టింది. ఆ పండితుడు నాచేయి చూచి, ఒక సంవత్సరంలో చచ్చిపోతానని చెప్పాడు. ఈ సంగతి నే నెవరికి చెప్పకుండా దాచాను....ఇక సంవత్సరం గదా బ్రతికేది....ఈ సంవత్సరంలోనూ నూతిలో కప్పలా జీవిస్తూన్న బ్రతుకును వదలిపెట్టి, సాని, సారారుచి ఎందుకు చూడ కూడదు ! వాటిలో ఏమి ఆనందం లేకపోతే ఇంతమంది ఆ రెండు శక్తులకు ఎందుకు దాసోహం అంటున్నారు ? ఆ ఆనందాన్ని అనుభవించాలని బుద్ధిపుట్టింది....అంతే....అమల్లో పెట్టేశాను....

వైద్యంమీద చిన్నచూపు పడింది. నామనస్సంతా ఈ రెండు విషయాల్లో నిమగ్నమైపోయింది....ఆనందం కన్పించింది....ఉల్లాసంగా ఉంది. సంవత్సరం గడిచింది....రెండు....మూడు సంవత్సరాలు గడిచాయి....కాని నాకు చావురాలేదు....బలహీనతలకు దాసుడనై పోయానేమో! వాటిని వదలించుకోవడం అసాధ్యమైపోయింది....ఇప్పటికి దాదాపు పదేండ్లు; చావురాలేదు.

ఇంట్లో పోరు పెరిగింది....నామీద నిర్బంధం ఎక్కువైంది.... అవమానించడం ప్రారంభమైంది. దానితో నాలో అసహనం, ఇంట్లో వారు చేస్తూన్న పనులకు నా కసహ్యం, ద్వేషం....ఫలితం మనసులో

తుఫాను. దాన్ని నివారించుకునే మార్గం ఏ వేశ్య కౌగిటిలోనే నిద్ర పోవడం....చిత్తుగా త్రాగడం....

ఇంట్లో వాళ్ళంతానన్ను దిగ్బంధనంచేశారు. అల్లరిపాలు చేశారు....దాంతో నా పనులవలన నాలో కలిగిన పశ్చాత్తాపం నశించింది. విరక్తిభావం కల్గింది, అయితే ఇందులో ఒక సత్యం మాత్రం ఉంది. ఇంట్లో నా మీద ఈ ధిగ్బంధనం నేను చెడిపోతున్నాననే బాధతోకాదు వారు చేసింది....వారి సుఖలాలసత్వానికి నా ఖర్చు అడ్డం వచ్చింది.

ఇదిగో బాబూ!....ఈ విల్లు నీ చేతికిస్తున్నాను....దానికి మాత్రం అన్యాయం చేయకండే....దానికి 20 వేల ఆస్తి యిచ్చాను. నా ఊపిరి ఉంటే ఆస్తే రిజిష్టరీ చేస్తాను....అంతవరకు బ్రతికేటట్లులేను........ వాళ్ళున్నారే....వాళ్లు....వాళ్ళకు కావలసింది ఆస్తి....నేనుకాదు....అంతా వాళ్ళ ముఖానే కొట్టానని చెప్పు...."

కుటుంబయ్య ఆతృతతో విల్లు చదువుకుంటున్నాడు. లోపలినుండి ఆమె పరుగెత్తుకువచ్చి 'ఏమండి, ఏమండి....' అని పిలిచింది. ఆమె హృదయపూర్తిగా భోరున ఏడ్చింది....రామనాథం అనాథలాగా ఎక్కడో ఒక కులట ఇంట్లో ప్రాణం విడిచినందుకు కుటుంబయ్య ఒక కన్నీటి బొట్టు రాల్చాడు.



# అసలు రహస్యం

రామారావు ఒక ఆస్తి విషయంలో త్యాగం చేశాడని విన్నాను. వెంటనే అనేక ఆలోచనలు తుఫానులా నా తలలోరేగినై. ఒక ఆలోచన అంది "జైలుకు వెళ్ళాడంటే, దేశస్వాతంత్ర్యం కొరకు వెళ్లాడనుకో వచ్చు," మరో ఆలోచన "ఈ త్యాగం ఎవరికొరకు?" అని ప్రశ్నించింది. "అతగాడు, హెచ్చు తగ్గులులేని మహోన్నత మానవ సమాజ నిర్మాణానికి వ్యతిరేకు"డని మరో ఆలోచన చెప్పింది. "ఆమహోన్నత మానవ సమాజ నిర్మాణానికి ఎంతోమంది ప్రాణాలర్పించారు. కాని, ఈ త్యాగ రహస్యం వెదకలేవా?" అని మరొకటి నన్ను ప్రశ్నించింది. "ప్రతి కార్యానికీ కారణ ముంటుంది. కారణం వెదకు. అసలు రహస్యం బైటపడుతుంది." అని సమస్యను కొంచెం తేలికచేసి చూపింది. దాంతో ఆ అసలు రహస్యం ఏమిటో తెలుసుకోవాలని నేను రామారావు ఇంటికి బయల్దేరాను. "కడు జాగ్రత్తగా మెలగాలిసుమా" అని మాత్రం నన్ను హెచ్చరించింది నా మనస్సు,

వెళ్ళి రామూను కేకవేశా. "ఉన్నారండి! చావిట్లో కూర్చోండి!" అని స్త్రీ గొంతు వినపడింది. సరే వెళ్ళి చావిట్లో కుర్చీలో కూలబడ్డా. "ఏలా తెలుసుకోవాలా రహస్యం?" అని మళ్ళీ ఆలోచించడం ప్రారంభించా. ఇంతలో రామూ వచ్చి "ఏరా! ఎక్కడా కన్పించడం లేదేరా?" అన్నాడు.

"ఏం లేదురా! గెలిస్తే కాస్త హుషారుగా ఉండేది"అని ముందు సానుభూతి వాచకాలతో ప్రారంభించా.

"ఏముందిరా దానిలో ఆశ్చర్యం! ప్రజలు గొర్రెలమంద. అసలు వయోజన ఓటింగివ్వడమే పెద్దతప్పు. తరువాత మన కాంగ్రెసు నాయకులుకూడ కొన్ని పొరబాట్లు చేశారురా" అన్నాడు రాము,

"అరే! రంగారావుగార్ని పెట్టకుండా నిన్ను పెట్టి ఉంటే కాంగ్రెసు గెల్చేదిరా!"అన్నా నేను రామూమీద ఎంతో ప్రేమను వెలిబుచ్చుతూ.

"ఆ ముక్క నేనంటే ఏం బావుంటుందిలే? ఇక నుండైనా మా నిజాయితీని ప్రజలముందు రుజువు చేసుకోవాలి.' అన్నాడు గంభీరంగా.

"అరే నీవుమాట్లాడేవి అన్నీ నాకు తలనొప్పి కలిగిస్తాయిరా! ఎప్పుడూ నీతి నీతి అంటావేమిటి? నీవున్న పదవులలో నే నుంటేనా ఇక చెప్పాలి! తెగ సంపాయించేవాణ్ణి. అధికారమున్నప్పుడే మనం సంపాయించుకోవాలిగాని, తరువాత మనమాట ఎవడు వింటాడు? మన ముఖం ఎవడు చూస్తాడూ అంట?"....అని ఓ చిన్న లెక్చరు మొదలెట్టా.

"నీవు చెప్పింది నిజమే అనుకో! దానికి మనం పునాదులుగట్టిగా వేసుకోవాలిగా"అన్నాడు రామూ తన హృదయంలో దాగిఉన్న భావాన్ని బైట పెడుతూ, నిజానికి కొంత మూలధనం వెనక వేశాడుకూడ.

"మరి అలాంటప్పుడు ఈ మధ్యన నువ్వు చెయ్యగూడని పని చేశావని విన్నా. దాంతో నీ మీద నాకు వళ్ళుమండిపోయింది. దాంతో ఆ విషయం ఏమిటో తేల్చుకుందామనేవచ్చా" అన్నాను.

"ఏమిట్రా అది? "అంత తప్పుడుపని నే నేంచేశాను?" అని తెల్లబోతూ అన్నాడు.

"రాజకీయ బాధితుడుగా నీ కిచ్చిన 5 ఎకరాలు వదలేశావటగా!"

"నిజమే. వదలేశాను."

"అది తప్పుగాదా మరి? నీకు ఊరికనే వచ్చిందా? నీ దేశసేవ; జైలు కష్టాల ఫలితం. అందులో నీవు ఒక్కడవేనా తీసుకుంది! పెద్ద నాయకులతోసహా తీసుకుంటే: ఏమోరా! నీ త్యాగం నాకు చాల బాధ కలిగించిందిరా" నా సానుభూతిని వెలిబుచ్చా.

"ఇదివరకు నేను చేసిన త్యాగంలో ఇదొక త్యాగంరా!" అన్నాడు గర్వంగా.

"అయితే ఈ త్యాగం ఎవరికోసంరా? ఎందుకు చేసినట్టురా?"అని

కోపంగానే ప్రశ్నించా. నా మాటలకు రామూరబ్బరు లాగ ఉబ్బి పోతున్నాడు.

"కాంగ్రెసును పునీతం చేయాలి. ఆ మహాసంస్థ గౌరవాన్ని పున స్థాపితం చేయాలి."

"మా చేశావు లెద్దూ! నీ వాక్కడివల్లే దాని గౌరవం పెరగదు. దాని రాజకీయ పంథాను, ప్రజాసేవను బట్టి పెరుగుతుంది, అయితే, ఈ రెండేళ్ళబట్టి దానిమీద ఏమైనా పెట్టుబడి పెట్టావా?" అని ప్రశ్నించా.

"ఆ! పెట్టకేం! సుమారు 300/లు వరకు పెట్టా." అని విసుగ్గా చెప్పాడు.

"అయితే ఆదాయం ఎంతవచ్చింది?" ఆతృతగా ప్రశ్నించా.

"ఆదాయంవస్తే మనకు దండగే ఉండేది కాదుగా! పైపెచ్చు ఆ బీడుభూమికొరకు అన్నీ తగాదాలే." అని విసుగ్గా చెప్పాడు.

"ఏం తగాదాలురా? నీతోతగూలు పెట్టుకునేందుకు ధైర్య మెవరి కుందిరా? నేనైతే మూడు కోర్టులూ తిప్పేవాణ్ణి" అన్నా.

"స్వాధీనం కొరకన్నీ తగాదాలేరా! ప్రభుత్వమూ పట్టా ఇవ్వదు. అది ఎందుకు? వట్టిదండగ" అని సంతృప్తిగా సమాధానం చెప్పాడు.

"అయితే నాకు తెలీకడుగుతాను వదలి వెయ్యడంలో మనకేమీ నష్టంలేదు గదా!" అని ప్రేమతో ప్రశ్నించా.

"బరువు తగ్గింది. నిందలు తగ్గాయి. నష్టంలేదు సరేకదా చేతి సొమ్ము వదలకుండా ఉంటుంది" కల్లకపటం లేకుండా అప్రయత్నంగా నాతో చెప్పాడు పాపం! 'అయితే నీ త్యాగనిరతిలో ఇమిడి ఉన్న అసలు రహస్యం తెలుసుకున్నా' అని సంతోషంతో, నెమ్మదిగా శెలవు తీసు కుని, రామూకూడ స్టంటుమాస్టరని మనసులో అనుకుని మనస్సును కుదుటపెట్టుకున్నా "ప్రతి విషయాన్ని కూడ సూక్ష్మంగా ఆలోచించాలి" అని మా!తం నురల నా మనస్సు హెచ్చరించింది.



# పరమసత్యం

ఆఫీసుకు ఆలస్యం అవుతుందనే భయంతో తొందరగా నాలుగు ముద్దలు నోట్లోవేసుకుని, ఆఫీసుకు చేరినా ఆలస్యమే అయి, నాలుగు చివాట్లను బాధలేకుండా స్వీకరించి కాగితాల ప్రపంచంలో మునిగిపోయా.

ఏదో గడియారం ముల్లు తిరుగుతూనే ఉంది కాబోలు! నేను మాత్రం కుర్చీలో కునికిపాట్లతోనే పనిచేస్తున్నా. ఇంతలో సూర్యనారాయణ వచ్చి నన్ను పలుకరించి, నా తపోనిష్ఠను భంగం చేసాడు. సూర్యనారాయణ ముఖంపై సంతోషం నాట్యం చేస్తోంది. ఒకవేళ అబ్బాయి ఏమైనా కలిగాడేమో అనుకొని, "ఏమిటి హుషారుగా నున్నావే" అని ప్రశ్నించా.

"నా సైకిలు దొరికింది." అన్నాడు సంతోషంగా సూర్యం.

"ఏదీ : ఆరునెలలనాడు పోయిన సైకిలా! చాల అదృష్టవంతుడ వోయి!" అన్నా.

"కష్టపడిన సొమ్ము అంటే" అన్నాడు నవ్వుతూ.

కాని ఆవార్త నాకు బాధకలిగించింది. అతనికి సైకిలు దొరికినం దుకుకాదు సుమాండి! నన్ను ప్రతి నిత్యం హెచ్చరికచేసే పరమసత్యం పొరబడిందే, అని. అదేగాక నామాటవింటే, పాపం సూర్యం సైకిలు అతనికి దొరికేదేకాదు. నేను చెప్పిన సలహాకూడ మీకు చెప్పక పోతే బాగుండదుగా మరి!

సైకిలు పోయినపుడు అధికారులకు రిపోర్టు చేస్తానంటే 'కాగితం సిరాఖర్చు దండుగరా! నాలుగు పైసాలు ఖర్చుచెయ్యాలిరాబాబు! పోయినదానికి ఈవడ్డీ దండుగ ఎందు'కన్నా.

అవునండోయ్! ఇప్పుడు ఓ గుర్తుకు వచ్చింది కదూమరి! మన భారతదేశం ఒక్క ఆధ్యాత్మిక చింతనలోనే కాక, న్యాయనిర్వహణలో కూడ విశిష్టత సంపాదించిందని ఇప్పుడు తెలిసింది. ఇక ఇప్పుడు

స్వతంత్రంగా ఆలోచించటానికి అలవాటు పడతాను. ఆలోచనలను జాతీయముచేస్తా. రాష్ట్రంకూడ వచ్చింది కాబట్టి ఆంధ్రుడుగా ఆలోచిస్తా. సరే; అసలు విషయానికి వద్దాం.

"ఎలాదొరికిందయ్యా? మన న్యాయసంరక్షకులు చాలదేవాంతకులు సుమా!" అని వారికృషి ఎడ నా అభినందనలు తెలిపా.

"అబ్బే! అందులో వారి గొప్పతనం ఏమీలేదు: వారు నా కాగితాన్ని ఇంతకాలంగా బుట్టదాఖలే చేశారు."

"మరి అయితే నీ సైకిలు ఎలా దొరికింది?"

"దానిగాథ చాల ఉంది" అన్నాడు సూర్యం.

ఏమిటేమిటి ఆ గాథ? అన్నాను.

"నాకు సైకిలు అమ్మినఆసామీ బజార్లో ప్రొద్దునపట్టుకున్నాడు." వెంటనే నేను ప్రొద్దున బజారులో చూచిన దృశ్యం గుర్తుకు వచ్చింది.

ప్రసన్నంగారి అబ్బాయి బాబు వద్దనేనా దొరికింది? అని ప్రశ్నించా.

అవును. ఆ షాహుంకారుగారి అబ్బాయి దగ్గరే అన్నాడు.

ప్రసన్నంగారు చాల పెద్దమనిషని, ఏదో ఒక అభాండం అన్యాయంగా విరుచుకుపడి ఉంటుందని సూర్యంతో అన్నా. సరేగాని, జరిగినదంతా చెప్పమన్నా సూర్యాన్ని.

జరిగిన యదార్థమేమిటో నాకు తెలీదుగాని, వారి కొట్టువద్ద పని చేసేవాడు సైకిలు చెట్టుకిందవుందని తనకు ఇచ్చాడని, ఎవరిదో తెలీక ఇంతకాలంగా తనవద్ద ఉంచుకున్నానని అధికారులవద్ద ప్రసన్నంగారబ్బాయి చెప్పాడు.

అబ్బా! ఎంత న్యాయబుద్ధి!

అట్లాగే అయిఉండవచ్చు; అందులో ప్రసన్నంగారు చాల పెద్ద మనిషి అన్నా.

"అదికాదు అసలు నిజం. అతడు నా సైకిలు సామాన్లుకూడ మార్చి వేశాడు. దీన్నిబట్టే అర్ధమౌతుంది అతని న్యాయబుద్ధి. నాకు సైకిలు అమ్మినతడు ఆ సామాన్లుమార్చిన ఆసామిని అధికార్ల వద్దకు తీసుకు వచ్చాడు. అతడు సామాన్లు మార్చిన విషయాన్ని అంగీకరించాడు. నా సైకిలు సామానులను నేనుకూడ గుర్తుపెట్టాను."

అయితే ప్రసన్నంగారబ్బాయికి శ్రీకృష్ణ జన్మస్థానం తప్ప దేమిటి? అని ఆతృతగా ప్రశ్నించా. నా పరమసత్యం ఓడిపోతుందనే భయం నన్ను బలహీనుణ్ణి చేసింది.

అది అతనికి తప్పదు. ప్రసన్నంగారితో రాజీపడవద్దని నన్ను అధికారులు గట్టిగా హెచ్చరించారు కూడా అన్నాడు సూర్యం.

దాంతో నేను నిలువునా నీరైపోయాను. కాని కొంతసేపటికి తేరుకొని :

నీవు ఇంత ఘంటాపథంగా బల్లగుద్ది చెప్పావా ? సాయంత్రానికి ఏం జరుగుతుందో చూద్దాంగా అన్నాను. నాకు ధైర్యమే నాపరమసత్యం ఓడిపోదని.

సరే; చూద్దాం! అలా జరగడానికి వీల్లేదు. ఉన్నవాడికి ఇదేంతెగులు! అని సూర్యం తనపని చూచుకోటానికి వెళ్ళిపోయాడు.

తరువాత కొంచెంసేపటికి ప్రసన్నంగారు నా కొరకు వెదకు కుంటూ గాభరాగా "పంతులుగారు! మీరు నాకు ఒక సహాయంచేయ్యాలి. నా మీద ఒక అభాండం వచ్చిపడింది" అని చెపుతున్నాడు.

ఏమిటీ అసలువిషయం ? అన్నా ఏమీ తెలియనట్లు.

మా కుర్రవాడు తెలీక ఒక పిచ్చిపనిచేశాడు. ఇప్పుడెలా అయినా మనం బయటపడాలి. అసలంతా మీ ఆఫీసులో పనిచేసే సూర్యనారాయణ

గారి చేతిలోఉంది. అతన్ని మీరు ఒప్పించాలి, అని నాకు జరిగినదంతా చెప్పాడు. అంత పెద్దమనిషి, పెద్దమనిషిలా ప్రాధేయపడుతూంటే నాగుండె నీరయి సూర్యాన్ని పిలిచాను.

వీరే ప్రసన్నంగారు. నీతో పనివుండి వచ్చారు. నీవు వారికి తప్పక సహాయంచేయాలి. వారికి వచ్చిన నష్టము నాకే వచ్చింది అనుకోవాలి అని సూర్యాన్ని ప్రార్థించా.

సూర్యానికి నిజానికి ప్రసన్నంగార్కి సహాయం చేయటాని కిష్టం లేదు. ఆ ముక్క ప్రసన్నంగారి ముఖంమీదనే అంటే బాగుండదని,

'ఇందులో నాది ఏముందండి! అధికారులు నన్ను రాజీపడవద్దని గట్టిగా నొక్కి చెప్పారు' అన్నాడు.

అధికారుల విషయం అంతా మేం సరిచేసుకున్నాము. మీరు సరే నంటే అంతా సర్దుబాటయినట్లే అన్నాడు ప్రసన్నంగారు. అధికారులనే విధంగా సంతృప్తి పరచిందీ నాతో రహస్యంగా చెప్పాడు ప్రసన్నం గారు, అదంతా రహస్యం. ఆ రహస్యం మీకు నేను చెప్పదలచుకోలేదు. బహుశా అది మీరు ఊహించుకోగలుగు తారనుకుంటా. విషయం తెలుసు కొనందే మనం బిగ్గరగా మాట్లాడకూడదు.

అంతలో కారుమీద ఖద్దరులాల్చీ వేసుకున్న జాతీయ నాయకుడు వచ్చి సూర్యాన్ని పిలిచాడు. సూర్యంతో ఏదో ఏదో మాట్లాడి ప్రసన్నం గారిని కారులో తీసుకుపోయాడు. సూర్యం సందిగ్ధావస్థలో పడ్డాడు. తన ఉద్యోమూ పెర్మనెంట్ కాలేదు. తనకీ ఉద్యోగం లభించినది ఈ జాతీయ నాయకుని కృపవలన, అందుచేత ఆయనమాటను కాదని ఎదిరించే ధైర్యం ఎక్కడ వస్తుంది సూర్యానికి! పాపం సూర్యం సైకిలుతో సంతృప్తిపడి పూరుకోవాలా!

సరే! సాయంత్రం బజారు వెళ్ళాను. ప్రసన్నంగారు తన కొడుకు మీద వచ్చిన అపనిందను గురించి ఏకధాటిగా ఉపన్యాస మిస్తున్నాడు.

'పంతులుగారు! మీరు పెద్దమనుష్యులు. మిమ్ములను ఎవరేం చేయగలరు?' అన్నా. పక్కకొట్టు ఆయన్ని నెమ్మదిగా అడిగా ఈ గొడవగురించి.

ప్రసన్నంగారబ్బాయికి అది మామూలే. బయటపడితే అపవాదు, బయటపడకపోతే స్వంతం, అన్నాడాయన నెమ్మదిగా. ప్రసన్నంగారివద్ద శెలవుతీసుకుని బయలుదేరి పోతూంటే సూర్యంవచ్చి, దీనంగ నా ముఖంలోకి చూచాడు. అతనివంక నేను గర్వంగా చూచాను. నా పరమసత్యం ఓడిపోలేదని.

ఉన్నమహారాజు ఏంచేసినా అది చెల్లుతుంది. ఉన్నవాడుచేస్తే దొరలేనివాడుచేస్తే దొంగతనం. ఇదిరా ప్రపంచధర్మంసూర్యం! అన్నాను.

సైకిలు అమ్మినవాడు, విచారశూన్యంగా ఆకాశంలోకి చూస్తున్నాడు. ప్రసన్నంగారుప్రసన్నంగాకులాసాగా కబుర్లుచెప్పుకుంటున్నారు.

# మధురస్వప్నం

## 1

కలలంటే నాకు మహాచెడ్డకోపంగా ఉండేది; ఎందుకంటే కలలు మనలను మోసముచేస్తాయి కనుక. పోనీ, ఆ మోసమయినా, కండ్ల ఎదురుగా—శత్రువు చేతికి కత్తిచ్చి పోరాడినట్లుగా మనకు జ్ఞాపకమున్నప్పుడే "మోసంచేస్తానురా" అని మోసంచేస్తే ఎంత బావుంటుంది? అలాచేయుటం వీరత్వంకూడ అనిపించుకొంటుంది. అంతేగాని దొంగ చాటుగా వెన్నుపోటు పొడిచినట్లు మనం నిద్రాప్రపంచములో ఉన్నప్పుడు మనలను మోసంచేయడంవల్ల కోపంరాదూ? పైపెచ్చు, మనలను నిద్రలో సత్యమని భ్రమింపజేసి, మనమనస్సులు మేల్కొనిన తర్వాత మిథ్యగా కనుపింపచేయటంలో తడిగుడ్డతో గొంతుక కోసినట్లుగాదూ, అందుచేత కలలంటే కోపంగా వుండడంలో తప్పేముందీ?

ఈకలకు జీవితముంటేనా, ఆ జీవితమంతా బయటపెట్టేవాణ్ణే. అసలునేను నిర్మొగమాటపు మనిషినికూడాను. అక్కడికీ కష్టపడి దాని సరుకంతా బయటపెట్టేసరికి, ఆటంబాంబు కనిపెట్టినంత పనయ్యింది నాకు. వాటి ఉనికికి కారణాలు నేనిప్పుడు చెప్పదలచుకోలేదు. నా రిసెర్చిలో కలనుగూర్చి ఇవికొన్ని ముక్కలే. కలకు ఒకరూపమనే ఉంటే అమాంతంగా దాని మీదకు దూకి డెలిబరేట్‌గా మర్దరుకూడ చేసేవాణ్ణే. ఉరికంబమెక్కినాసరె. ఏంలాభం? దానికి రూపంలేదు. మీకు నా ప్రతాపము తెలుసుకునేందుకు సావకాశమూలేదు.

ఆ వెధవకలలు మంచిరూపాలలోవస్తే బాగుండును. ఏ ఆకాశం మీదనుండో క్రిందకు పడినట్లు రావటం, మనం మంచంమీదనుండి క్రిందపడడం. దాంతో ఏతలకాయో బొప్పికట్టడం, లేకపోతే ఏ వికృత రూపంలోవో వచ్చి మన పీకెలమీద కూర్చుని ఊపిరిసల్పకుండా మనలను ఉక్కిరిబిక్కిరిచేసి, కేకలువేయించి, చంపినంతపనిచేసి, తెల్లవారి భూత

వైద్యుని దగ్గరకు పంపించి, వాడుబాగుపడేటట్లుచేసి, మనకు వాళ్లను తప్పులు వదిలేటట్లు చేయటం.

# 2

తననుగురించి నాకుగల అభిప్రాయాలు కలకు తెలుసు. తన యందు నాకుగల ద్వేషభావము, శతృత్వముకూడ తెలిసి, తనగుట్టంతా బయటపెడుతున్నానని భయపడి నాతో రాజీపడడానికి వచ్చింది కల. నాతో అంది "మీరు నాయెడల అన్యాయంగా శతృత్వము వహించారు. అయినప్పటికీ మీయందు నాకు స్నేహభావమే" ననేటప్పటికి గాంధీజీ అహింసాసిద్ధాంతము, మన స్వాతంత్ర్యం గుర్తుకొచ్చినవి. బ్రిటీషురాజే లొంగగా నేను లొంగితేమాత్రం తప్పేముందనుకొని, సరే చెప్పేదేదో చెబితే ఆలోచిస్తానన్నాను. వెంటనే లొంగినట్లు కనబడితే బావుండదని. ప్రేమతో నాకొక డిన్నరుపార్టీ ఇచ్చి, నా హృదయాన్ని దొంగిలించి, ప్రపంచంలోనాకు తాను తప్ప మరో స్నేహితుడెవ్వడూ లేనంతపని చేసిందంటే నమ్మండి. ఆ డిన్నరుపార్టీలో నాకు "మధురస్వప్నాన్ని" రుచిచూపిస్తానంది. అది రుచి చూచిన తరువాత "నీ యెడ యే అభిప్రాయ ముందీ తెలియచేస్తానన్నా" మధురమంటే మీకు కోపంవస్తుందేమో? ఇప్పటివరకు "కలని" ఇంత చేటుగా తిట్టినా, మీకోసానికి గురయినాసరే, చటుక్కున రాజీపడ్డాను. మీరీ విషయాన్ని నమ్మలేకపోయినా, నేను రాజీపడినమాట నిజమని మీరునమ్మండని మరొకసారి చెబుతున్నా; మీరు చాటుగా తిట్టుకున్నాసరే.

కమ్మగా భోజనంచేసి, సిగరెట్టు కాల్చుకుంటూ, ఏమీతోచక వెల్లకిలా పడుకుంటే ఏవేవో ఆలోచనలు బుర్రలో తిరిగిపోతున్నవి. ఆవిడ గుర్తుకొచ్చింది. ఇలాతీరుబడిగా ఉన్నప్పుడు,ఇంటిదగ్గరలేనప్పుడు, పనిలోఉండి చిరాకుగా ఉన్నప్పుడు ఎందుకో కనిపించు తుంటుంది. అయినా ఏమయినాబుద్ధి ఉండదంటారా? అయిదు నెలలయినవికదా పుట్టింటికిపోయి, ఏమన్నాఅంటే స్త్రీ స్వాతంత్ర్యం: నా కోపాన్ని

నాలో నేనే దిగ్రుంగుకుని మాట్లాడకుండా పడుకున్నా; నిద్రాప్రపంచము లోనికి ప్రయాణంకట్టా.

అన్నమాట ప్రకారం 'కల' మధురమయిన రూపములోనే వచ్చింది. కొంతవరకూ నిజాయితీవుందని అంగీకరించకతప్పదు. ఆ "స్వప్నం" ఓ చక్కటి అమ్మాయిరూపంలో వచ్చింది. అంత అంద మయిన అమ్మాయిని నేనెప్పుడూ చూడలేదు. యధార్థంలో చూడలేను కూడా. అబ్బా ! ఆ నునుపైన, మృదువైన, చక్కటి,బొద్దు శరీరం! ఎంత అందంగా వుందనుకున్నారూ ! మీ రెవ్వరూకూడా అలాంటి రూపసిని చూచి ఉండరు. కవిత్వమువస్తేనా అల్లసాని, గిల్లసాని మనదగ్గరకు పనికి వచ్చేవారేకాదు ఆమెనువర్ణించేందుకు. ఆమెను చూడగానే నోరు తెఱచి రెప్పవాల్చకుండా చూచానన్నమాట.

వచ్చి సరాసరి నాప్రక్కపై చిరునవ్వుతో కూర్చుంది. తా వలచి వచ్చి నా ప్రక్కనకూర్చున్న వనితారత్నమును పలుకరించకుండా ఉండడంలో నాకేమంత మర్యాద కనుపించలా. ఏమని పలుకరించాలో అర్థంకాలేదు. "అయినా ఈ అమ్మాయికి చనువు ఎవ్వరిచ్చారూ ?" అనుకుని సోషల్‌గావుండే గరల్ అయివుంటుందని భావించుకొన్నా.

చక్కనిచుక్క ప్రక్కలో కూర్చుంటే, కంట్రోల్ చేసుకోవడం ఎంతకష్టమో ఆలోచించుకోండి. అప్పటికప్పుడే ఆ అమ్మాయిని బాహు వుల్లో బంధిస్తే బావుండుననేకోర్కె నన్ను తొందర పెట్టుంది. కాని ...ను పలుకరించకుండా తొందరపడితే బ్రూటిష్‌గా ఉంటుందనుకొని, ...క చెంపదెబ్బదలయితే బ్రతుకంతా బజారవుతుందని భయపడి "ఇలా వచ్చారని" అడిగా.

...మె పెదవులపై చిరునవ్వు నాట్యమాడుతుంటే నాపెదవులు ...ందరపడుతున్నయ్. ఆ గులాబి పెదవులలోంచి "ఎందుకని ...మిటి ?" అని ఎదురుప్రశ్న వచ్చింది. దాంతో కోరికలకు ...చ్చా. నేను ప్రవరాఖ్యుడను కానని నిరూపించదలచు పించా.

చల్లగాతగిలిందిబట్ట శరీరానికి. మెళుకువవచ్చింది. ఒక దిండేమో నా బాహువులలో చిక్కివుంది. మరోదిండుపై నాముఖముంది. ఏమిట్రా ఈ మోసం! అనుకున్నా. దెబ్బతిన్న త్రాచుకువచ్చినంత కోపంవచ్చింది. అయినా నేను పొందిన మధురత్వము నా కోపాన్ని శాంతపరచింది.

మిథ్యఅయినా అందులో ఎంతమధురత్వం కనుపించింది? యథార్థ జీవితములో అలాంటి ఆనందాన్ని అనుభవించలేం. అయినా మనము ఎప్పుడూ యథార్థమునే కోరుతూవుంటాం; కోరాలికూడాను. కాని స్వప్నాల్లోకూడా భయోత్పాతమే కాకుండా, మధురత్వంకూడా ఉంటుంది.

కలలు అప్పుడప్పుడూ నిజమవుతుంటాయని అంటారు పెద్దలు అందుచేత నేను స్వప్నంలో చవిచూచిన ఆనందాన్ని, అలాంటి అమ్మాయినుండి పొందేందుకు ఎదురుచూస్తున్నా. ఆ అనుభూతిని, ఆనందాన్ని మరచి పోలేనుగా మరి!



